శ్రీరామ

ఆర్యచరిత్రరత్నావళి

# వై ధ వ్య ధర్మ చ ర్య

ప్రథమభాగము.

వా వి లి కొ ల ను సు బ్బ రా య
వి ర చి త ము.



ప్ర కా శ కు లు.

శ్రీ కో ద ం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

ఆపదా మపహర్తారం

దాతారం/ సర్వసంపదామ్



లోకాభిరామం శ్రీరామం.

భూయో భూయో నమామ్యహమ్

క. నీపారకమలసేకయు
నీపారార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతరయమును
పసమందార ! నాకు దయ సేయఁగ



తండ్రి పిల్లవాండ్రకు ఆర్య చరిత్రములు చెప్పుట.

# పీ ఠి క

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన తాతగారికి,

మీరు పంపిన హితచర్య చేరినది. చదివితిని. నా పతిజీవించియున్న కాలమునందు తమచేర చింపఁబడిన శకుంతల,సావిత్రి,సీతాదేవి చరిత్ర, పతి హితచర్య,కుమారీ హితచర్య, సతీ హతచర్య మొదలగు గ్రంథములను చదివి ఆనందించి యిట్టి అమూల్య గ్రంథముల ననుసరించి నాజీవితకాలమంతయు గడప నుద్దేశించియుంటిని. నా పూర్వజన్మపాపముచేత ఇప్పు డీ దశ వచ్చినది. ఆ కాలమున ఆగ్రంథముల నెట్లు నమ్మి యుంటినో ఈకాలమున తమచేత వ్రాయబడిన ఈ గ్రంథమునే ఆదర్శకముగా నుంచుకొని జీవయాత్ర గడుప నెంచితిని. విషయములు చదువుటకు సులభములు. ఆచరణలోనికి తెచ్చుటకు ప్రయత్నించుచున్నదానను,ఇన్ని దినములుగా తమరికి ఒక జూబైనను వ్రాసినదాననుగాను. తమ గ్రంథమును చదివి ఆనందభరితురాలై యుంటిని. ఇక ఈ పుస్తకము ముద్రింపనవసరమా యని మా అన్నగారికి తాము వ్రాసిన జూబులో వ్రాసినారని మాఅన్న చెప్పినాడు. ఇదివఱకు వ్రాసిన గ్రంథములెంత అవసరమో ఈగ్రంథము అంత అవసరముని నేను చెప్పనవసరము లేదు. నాబోటివారు ప్రపంచమున వేలకొలది వెలువడుచున్నారు. దేవసేవయు,భాషాసేవయు,శ్రీరామసేవయు చేయుచున్న తమబోటివారికి యీ గ్రంథము అవసరమా అనవసరమా యని నేను చెప్పపనిలేదు. అవసరములేని దే శ్రీరామచంద్రుఁడు తమరిని పురికొల్పఁడు. కాబట్టి తప్పక ముద్రించి నాబోటివారికి జన్మసాఫల్యము గలిగించ ప్రార్థించుచున్నాను. మీరు వ్రాసినటుట నాభర్త నన్ను ఏమరక యున్నటులనే యున్నది. ప్రతిదినమును ఆయన దర్శన మిచ్చుచునేయున్నారు. కాబట్టి శ్రీరామసేవయందే నాజీవితమంతయు గడిపి పరలోకమందున్న నాభర్త యొక్కయు ఈ లోకమందున్న నా జన్మము నా జన్మకారకులైన నా జననీ జనకులయొక్క జన్మము సార్థకముగావింప ప్రయత్నించుచున్నాను. సర్వమునకు శ్రీరామచంద్రునే నమ్మియున్నాను.

ఇట్లు.
శ్రీరామ చరణ దాసురాలు,
**గం. కా మే శ్వ ర మ్మ.**

===========

శ్రీరామ

# వై ధ వ్య ధ ర్మ చ ర్య

## ప్ర థ మ భా గ ము

==========

గంగా భాగీరథీ సమానురాలయిన కామేశ్వరమ్మను దీర్ఘాయుష్మతిగ దీవించి వ్రాయునది యేమనగా:-

అమ్మా !

నెల్లూరి శ్రీరంగనాయకస్వాములవారికి మా తల్లిగారిపేర జరగు గజేంద్రమోక్షణోత్సవమును దర్శింపఁ బదిదినములకు ముందు వచ్చినపుడు నీకుఁ బ్రాప్తించిన దుర్దశను విని మీ తండ్రితోడ నిన్నుఁజూడవచ్చిన సమయమున నీవు వెలవెలఁ బాఱు మోముతో,శూన్యలలాటముతో,నసంస్కృతశిరోజములతో,నెఱ్ఱఁబాఱిన కనులతో,మ్రొక్కుఁరాఁగా నా వాడుకప్రకారము భగవతే నమ యని నేను నీయందలి యీశ్వర కళకు నమస్కరించి పదపడి "నిన్ను నే నేమని దీవింతునమ్మా" యని యడిగి నీవు మ్రొక్కినపుడు దీర్ఘాయుష్మతీ భవ యని మనస్సులో గొణిఁగితిని. నా మాటలు నీకు వినఁబడియే యుండిన వెంటనే నీవు "అధవనై వియోగసాగరమున మునిఁగి విషాద మకరముచే భక్షింపఁబడుచు నేనే దీర్ఘకాలము బ్రతుకవలయునా ?ఈ సంతాపాగ్నినుండి నేను శీఘ్రకాలమున విడివడుట మీకు సమ్మతముగాదా ? నేను బ్రతికి యెవరి నుద్ధరింతును ?శుభకార్యములపట్ల నలువురు ముత్తైదువులతోపాటు తిరుగును గూర్చుండను బుణ్యములేదా యెఁగదా. అంతైన మేలే. అదాటున నేనెవరి కెదురు పడినను నిధవాదర్శనము కార్యము. పాడందురుగదా. కొందఱు తిట్టనే తిట్టుదురు. నండను వార్పను జాకిరిపనికి నన్ను మావారు పిలుతురేకాని శుభకార్యముల కెవరైనఁ బిలుతురా ? పిడుచెఁడుకూటికేకదా యిఁక నేనొకరిసేవ చేసి బ్రతుకవలయును. పదునాఱు సంవత్సరములకే నాకీ కష్టదశ ప్రాప్తించినఁ జిరకాల మేమి సంతోషముతో దేహయాత్ర సాగింతును ? ఇంతవఱకు మీరు వ్రాసినప్రకార మేకాదసులు నా పతియాజ్ఞలేకనన్నుఁ జేర వెఱు చుచుండెను. ఇఁక నవి యన్నియు నన్నుఁ బీడించునుగదా. ఏకాదశులైన మేలే. దినదినము తిను తిండికిఁగూడ నేను దొంగనేకదా. రాత్రులందుఁ దిండి చాలింపనైనఁ జాలింపవలయును. తలుపులు మూసికొని రహస్యముగనైన గతుకవలయును. ఫలాహారము చేసితినవి యసత్యమైన నాడవలయును. నెల దినములనాఁడు నేను గట్టిన వస్త్రము పెట్టిన సొమ్ము నాకిప్పుడు పరమశత్రువు లాయెఁగదా ? వేగముగఁ జావుమని దీవింపకఁ యిట్టి దుర్దశలో దీర్ఘకాల మడవికాచిన వెన్నెలవలె జీవింపుమని దీవించుటకు మాబోఁటివారల కష్టముల మీ రెఱుంగకుండుటయే,యెఱుంగుటకు సాధ్యపడకుడుంటయే కారణమని తలంతును. అని చెప్పియుందువు. అంతియగాక "యిది వఱకు మీ కుమారీ హితచర్య సతీ హితచర్య మార్గదర్శకములుగ నుంచుకొని యందు మీరు చెప్పిన ప్రకారము నడచుకొనుచు నెంతో భక్తిశ్రద్ధలతో నా భర్తకు మిక్కిలి శ్రమించి పరిచరించుచుంటిని అట్టి నా కిట్టిగతియేల కలిగెను ?అంతటి ఘోరపాపము నేనేమి చేసితిని ? ఇఁక నాగతియేమి ? ఏది నాకు శ్రేయస్కరమైన యుత్తమమార్గము. ప్రపంచము నాకు శూన్యముగను భయంకర స్మశానముగను గానవచ్చుచున్నది. ఇందు నేనెట్లు సంచరింపవలయును. సహగమనమైన చేయరాదుకదా ?" అని యడిగితిని.

ఈ విషయము నన్నిదివఱకుఁగొందఱు వ్రాయఁగోరిరి. ఇప్పుడు నీవింత శ్రద్ధాభక్తులతో నడిగినప్పుడు నేను జెప్పకుండరాదు. కావున నాకుఁ దోఁచినది చెప్పెదను. దానియందు నీకెంత సాధ్యమో యంతయే నిర్వంచనముగఁ జేయఁ బ్రారంభింపుము. క్రమక్రమముగ నంతయుఁ జేయఁ గలుగుదువు. ముందు కొన్ని విషయములుచెప్పి యావల నీవు నడచుకొనవలసిన విధానము చెప్పెదను.

ఆయుష్మతిని గమ్మని దీవింపఁ గారణము వినుము. ఎట్టివారైనను దేహయాత్రాకార్యము ముగియువఱకు మరణమును దామైకోరరాదు. "కృతకృత్యా నిరీక్షంతే మృత్యుంప్రియ మివాతిథి" మ్మన్నట్టు కృతకృత్యులయినవారు మాత్రమే యిష్టము వచ్చినప్పుడు దేహమును ద్యజింపవచ్చును. అట్టివారు కూడ మృత్యువు వచ్చినప్పుడు ప్రియాతిథి యింటికివచ్చినట్టు లాదరింతురుగాని కష్టములకు శోకములకు భయపడి శరీరత్యాగము సంకల్పింపరు. కృతకృత్యులనఁగా జీవన్ముక్తులు.

ఈలోకమున దేహధారులై యుండియే ముక్తదశ,ననుభవించువారు. ఇట్టిదశకర్మాదియోగంబులసాధించి పారముఁ బొందుటచే లభించును. భూమిమీదనుండి ముక్తికై తాము సాధింపవలసిన దేమియు లేక నిశ్శేషముగ సాధించిన వారగుటచే దేహముతో సాధింపవలసిన కార్యములు ముగియుటవలన నిఁకదానితోఁ గావలసిన

కార్యములు లేకుండుటచే గమ్యస్థానముఁజేరినవాఁడు శకటమును దిగి తమ సొంత యింటిలోనికిఁ బోయినట్లు యోగులగువారు నీ దేహమును విడిచి పరమపదమునకుఁ బోవుదురు. ఇట్టి యోగులు తప్పఁ దక్కినవా రెవ్వరేని చావఁ గోరిరేని వారు మహాఘోరనరకముల పాలగుదురనియు నట్టివారి ముఖము నవలోకింప రాదనియు శాస్త్రములు చెప్పుచున్నవి. కావున నెట్టిగయ్యాళి గంగమ్మలైనను జావురాక పోయెనేయని యనరాదన నాత్మహత్య చేసికొనరాదని వేఱుగఁ జెప్పవలయునా ? భగవంతుఁడు నియమించినంతకాలము భూమిమీఁద బ్రతికియుండ వలసినది దేహధారికివిధి. అటుచేయక దేహముఁ ద్యజించువారు భగవదాజ్ఞనుల్లంఘించినవారై దానికని విధించిన శిక్ష యనుభవింతురు.

"అసుర్యానామతేలోకా, అంధేన తమసావృత్తాతాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి, యేకాచాత్మహనోజనా" యని యీశావాస్యోప నిషత్తునందుఁ గలదు. ఆత్మహత్య చేసికొను వారు ఘోరబాధాకరమై, యసుర సంబంధమై వెలుతు రెట్టిదో తెలియని గాఢాంధకారముగల యంధతామిస్రమను భయంకరనరకమునకుఁ బోదురు. భూమిమీఁద మనుష్యుఁడు పుట్టునప్పుడే వీఁడింతకాలము జీవింపవలయునని బ్రహ్మనిర్మాణము కలదు. ఆ కాలములోపల దేహమును విడుచు రా యాయుష్కాలము పూర్తి యగువఱకు నూర్ధ్వలోకములకుఁ బోవుటకు లేక భూమిపై నుండుటకు లేక పిశాచములై యంతరాళమున నల్లాడు చుండవలయును. ఆవలనైన వీరికి మీఁదఁ జెప్పినట్టు అంధతామిస్ర నరకమేకాని యూర్ధ్వలోకములులేవు. దైవాజ్ఞమీఱి వర్తించువారికి సుఖమెందుండి వచ్చును?

దీర్ఘకాల మేల జీవింపవలయును ? దేహధారణమునకు ముక్తి పరమావధి. అట్టి ముక్తిలభింపఁజేసికొను వఱకు నెన్ని వేల జన్మంబులయిన నెత్తి దేహి తన్నిమిత్తమైకృషి చేయుచుండవలయును. మనకు గమ్యస్థానము బదరీనారాయణ క్షేత్రమను కొమ్ము. ఇతరచింతల నితరకార్యములేక దానియందే దృష్టి మనస్సునుంచి తదేకనిష్ఠఁ బయనించువానికి నాఱుమాసములు పట్టు ననుకొమ్ము. గమ్యస్థానము చేరుట యనివార్యమైనప్పుడు నిద్రాహారము లైన విసర్జించి శ్రమించి రేలుంబవళ్ళుపయనించు వాఁడు బుద్ధిమంతుఁడా? అలసుఁడై త్రోవనడువక పెడత్రోవలఁ ద్రొక్కి వంకల డొంకల ఱాల అప్పల ముండ్ల గండ్లపాలై దుఃఖించుచు నెన్ని దినములకు దరిదాపు గాననివాఁడు బుద్ధిమంతుఁడా ? పగళ్ళయందేకాని రాత్రులందుఁ బ్రయాణము సాగనట్టు భూమిమీఁద దేహముధరించి యుండునపుడే ముక్తిమార్గమున నడవవలయును. కరణకళేబరములేక యిందుఁ జేసిన కర్మముల ఫలమనుభవింపఁ బోయిన నరకస్వర్గాదులను విశ్రమ స్థానములందుఁ బయనము సాగదు. దక్షిణాయన కాలమున నహస్సుతక్కువ. ఉత్తరాయణమున నెక్కువ. ఉత్తరాయణమునఁ బగళ్ళసాగినంత ప్రయాణము దక్షిణాయన దినములసాగదు. కావున మన జీవితకాలమునందే సాధ్యమైనంత దవ్వుపయాణింపవలయును. విశేషదూరము పయినింపఁగోరిక విశేష కాలముజీవింపవలయును. విశేషకాలముజీవించు కోరికకుఁగారణము ముక్తిమార్గమున విశేషదూరము పయనించు ట కయియే. దీర్ఘాయువును ముక్తిమార్గమున నడచుటయందే వినియోగింపవలయును. ఈ విధముగ నాలోచించి తివేని మనజీవితోద్దేశము దీర్ఘాయువు కోరఁ గారణము స్పష్టమగు. ఈ మార్గమునకే నివృత్తిమార్గమని పేరు.

"శరీరమాద్యం ఖలుధర్మసాధన" మ్మని కలదుకదా. శరీరము లేకున్న నెట్టి పుణ్యము సాధింప సాధ్యపడదు. మనమేలునకై భగవంతుఁడు మనకిచ్చిన మనమేలుగోరి యిచ్చిన భగవంతుని దూషించినవారమే కదా యగుదుము నీ కిచ్చగలదేని యీ జన్మాంతమందే నీవు ముక్తిని సంపాదింపవచ్చును. అది యసాధ్యముగాదు. అన్నివృత్తులు మంచివేయైనను గొందఱు నడవడులవలనఁ గొన్నివృత్తులు చెడ్డవనిపేరొందినట్లు దశలన్నియు మంచివేయైనను వానిని నుపయోగింపఁ దెలియనివారిచే నవి చెడ్డవిగా భావింపఁబడుచున్నవి.

అట్లైన నిప్పటి నా దశ మంచిదని యందురా యనెదవేమొ. నిస్సందేహముగ మంచిదనియే చెప్పెదను. ఎట్లన.

దేహికిఁ బ్రయాణమార్గములు రెండు. (1) ప్రవృత్తిమార్గము. (2) నివృత్తిమార్గము. ధర్మార్థకామ కాంక్షచే దేహయాత్ర చేయువారు ప్రవృత్తిమార్గనిష్ఠులు. వీరు ఫలములఁ గోరి కర్మములు గావించి నరక స్వర్గ దుఃఖసుఖము లనుభవించి భూమిపై జన్మించి మరణించి యిట్లు భూ నరకస్వర్గముల నడుమ సంచారము గావించుచు సంసార చక్రభ్రమణంబునఁ దగులుకొని యెన్ని కల్పములైనఁ బరితపించుచుందురు. ఇది సంసారులమార్గము.

సంసారమున నుండికాని యుండకకాని ఫలములఁగోరి కర్మములు చేయక, చేసెడికర్మములను భగవద ర్పణ బుద్ధితోఁ జేయుచు వాని ఫలములను భగవంతున కర్పించుచు దేనియందును సంగములేక బురదలోఁ దిరుగు కుమ్మర పురువువలెఁ దామరపాకు నందలి నీటివలె నంటియు నంటక దేహ మేకార్యములఁ జేయుచున్న ను మనస్సు బుద్ధి భగవంతునియం దుంచువారు నివృత్తి మార్గనిష్ఠులు. ఈ మార్గమందుండి మరణించిన వారు పరమపదమున కేగుదురు. వారు మరల జన్మములకు రాకయందే నిత్యానంద సుఖ మనుభవించుచుందురు.

ఈ రెండు మార్గములలో మేలైన దేది ? రెండవదియగు నివృత్తిమార్గమే కదా. చుట్టిన చాఁపను బఱచి నట్లు సంసారమును విస్తరింపఁజేయుట ప్రవృత్తిమార్గ లక్షణము. పఱచిన చాఁపను జుట్టుటవంటిది నివృత్తిమార్గ

లక్షణము. విస్తరింపజేయుట యెట్లందువేని వినుము. భూమిలోఁ బడిన విత్తనమొక మొలకగా లేచును. దానియందుఁ గ్రమక్రమముగ రెండు నాలు గీ ప్రకారమాకు లెక్కవగును. కొమ్మలుపుట్టును. వానియందు రెమ్మలు కలుగును. పూలు–కాయలు పండ్లు కలుగును. పండ్లలోని యన్ని విత్తనములన్ని చెట్లకుఁ గారణమగును. అట్లే తల్లి గర్భము నుండి స్త్రీయో పురుషుఁడో యొక వ్యక్తి యుద్భవించును. వివాహముచే నిద్దఱగుదురు. సంతానముచే ముప్వురు నలువురు పదుగురు నగుదురు తరువాత మనుమలు–మని మనుమలు కలుగుదురు.

ఏఁబదిమందిగల సంసారముల రెంటిని నేను గంటిని. ఈవిధముగ వంశవృక్షము విస్తరించును. ఇట్లు సంసారమునువృద్ధిచేసికొనువారికి మోక్షములేదు. ఇఁక మోక్షకారణమైన నివృత్తిమార్గము విధమును వినుము. సంసారమునుండి విడుదలయగుటే మోక్షము. ఈ మార్గమున నడుచువాఁ డిట్టులాలోచించును. జనులు పుట్టుట చూచుచున్నాను. చచ్చుటచూచుచున్నాను. పుట్టునవి యన్నియు గిట్టుచునే యున్నవి. రెండునూర్ల సంవత్సరములనాఁడు నేను బుట్టితినని చెప్పెడువాఁ డేఁడీ. రెండు నూర్లగావు. రెండు లక్షలయేండ్లు బ్రతికినను బుట్టినవన్నియుఁ జావవలసినవే. పర్వతములు,వృక్షములు దీర్ఘ కాలము బ్రతుకవా యనిన గాఢతమో గుణముగల పర్వతపాషాణదులు దీర్ఘకాలముబ్రతుకును. రజోగుణ మెక్కువగుకొలఁది యాయువు క్షీణించును. మరల సత్త్వమెక్కువగుకొలఁది యాయువెక్కువగును. కావుననేపూర్వులు వేలకొలఁది సంవత్సరములు బ్రతుకఁగలిగిరి కాఁబోలు. ఇన్నిటిని సృష్టించిన బ్రహ్మయే లయించుచుండఁ దక్కిన వాని మాటయేల? ఎన్నికల్పములైన నిట్లు చచ్చుచుఁ బుట్టుచు నుండవలయునా? విడుమరలేదా ? ఈ యాపత్తునుండి తప్పించువారు లేరా ? తిండికిఁజేటుగ నిల్లునిండ నిందఱున్నారుగదా ఒకరైన నాపదవేళనాదు కొనెదరా ? పెండ్లాము–కొడుకులు–కోడండ్రు–కూఁతులు–నల్లుండ్రు–బావలు–మఱఁదులు–వదినెలు–మఱదండ్రు–అక్కలు–చెల్లెండ్రు–ఆహా! యెందఱు బంధువు లెందఱుబంధువులు! ! వీరందఱు నాకేమి చేయుదురు? ఏమి చేయఁగలరు? గోతము బియ్యము నాలుగు దినములలో మాయము చేయఁగలరు. ఆపద కాదుకొనలేని యీ చుట్టా లుండిననేమి లేకుండిననేమి ? వీరే నన్ను రక్షింపఁజాలరఁట. ఇఁక నిల్లుభూములు గొడ్డులా నన్ను రక్షింపఁగలవు. ఛీ దుఃఖకారణమైన వీరి జంజాటమును మానుకొనెదను. మానుకొంటిని. అందఱును దొలఁగఁదీసియేకాంతినైతిని. ఈమాత్రమున నాకు మరణము తప్పునా ? మరల జన్మము దప్పునా ? నా మరణజననములకు వీరు కారణభూతులైనఁగదా వీరిని దొలఁగించిన నా జననమరణములు తప్పును. నాదికాదు నాదికాదని సర్వము విడిచితిని. దేహము నేను మిగిలితిమి. ఈ దేహమైన నాదియా ? కాదు. దీనిని విడుచుటెట్లు ?నీళ్ళలో దుమికి చత్తునా ?అంతలో మరల జన్మము దప్పునా ?తప్పదు తప్పదు. ఇఁకనెట్లు తప్పును ? ఈ దేహము నాకేల లభించెను? నేను జేసిన పుణ్యపాప రూప కర్మానుభవము కొఱకు. కాఁబట్టి పుణ్యపాపరూప కర్మములను జేయుట చాలించితినేని దేహము రాకుండును. ఇది యసాధ్యము. ప్రవాహమువలె దీపమువలెఁగాల వేగంబున క్షణక్షణము మాఱు దేహము కర్మముచేయక యెట్లుండఁగలదు?

ఈ జన్మమందే యిదివఱ కెన్నియో చేసితిని. పూర్వజన్మ సంచితము గలదు. ఇవన్ని పోవుటెట్లు? కర్మములు చేయకుండుట యసాధ్యము కావున వానిని జేయవలసినదే. వేఱుగతిలేదు. కర్మఫలానుభవము నా కెట్లు కలిగెను? ఆ కర్మములవలన నట్టిఫలము కావలయునని నేను గోరుటచేత. కాఁబట్టి వాస్తవమారయ నాకు జననమరణములకుఁ గారణభూతమైనది నా కోరికలే కాని కర్మములుగావు. కోరికలులేక కర్మములఁ జేసితినేని యట్టి కర్మములు నన్నేమియుఁ జేయఁజాలవు. ఇది నిజమేకాని కోరికలు కోరునది యేది ? మనస్సు. మనస్సు సుఖమును గోరును. అది మంచిపనియేకదా. సుఖమును గోరుట మంచిదేకాని యా సుఖమెట్లు వచ్చునో యది యెఱుఁగక యింద్రియములవెంట వెలుపలఁ బోయి విషయములవలన సుఖముగలుగునని భ్రమించును. శాశ్వత పదార్థము శాశ్వత సుఖము నీయఁగలదుగాని యశాశ్వతమైన దెట్లు శాశ్వత సుఖమీయఁగలదను తెలివి దానికి లేదు. కాఁబట్టి యింద్రియముల నుండి మనస్సు వెలికిఁ బోకుండునట్లు ద్వారముల మూయవలయును. కన్నులు చెవులు ముక్కు నోరు మూసికొని కూర్చుండినంత మాత్రమున మనస్సు వెలికిఁ బోకుండునా ? వెలికిఁబోయినను బోకున్నను బూర్వము వినినవానిని జూచినవానిని దినినవానిని వీనిని స్మరింపక విడువదు. కావునఁ గన్నులు మొదలగు వీనిని స్మరింపక విడువదు. కావునఁ గన్నులు మొదలగు నింద్రియముల మూసినఁ బ్రయోజనములేదు. ‘ఓ వెఱ్ఱిమనసా ! బాహ్యవిషయములవలన నీకు సుఖమే లభించునని వానివెంటఁ గుక్కవలెఁ బరువెత్తెదవేల? ఇవి యన్నియు నశాశ్వతములు దుఃఖకారణములే కాని సుఖ కారణములు కావు. శాశ్వత పదార్థమే శాశ్వత సుఖము నిచ్చును. అట్టి దానిని వెదుకుమని విషయములందుఁగల దోషములను వానిని విడిచినఁ గలుగు సుఖమును దృఢముగ మనస్సున నాటఁజెప్పుచు విషయ పరిత్యాగము చేయవలయును. త్యజింపరాని వానిపై రాగము మానవలయును. అప్పుడు మనస్సువెలుపలి సంచారము మాని లోవైపున సంచారము చేయఁబూనును. ఇట్లు లోపలిఁ బరిశీలింపఁ బ్రారంభించి ప్రకృతి పరిణామమైన దేహము దాని వికారము లన్నియు నశాశ్వతములని రోసి హృదయమందుండు జ్ఞానానంద మయమయిన యాత్మను గనుఁగొని తదాలోకనమువలనఁ గలిగిన

యానందమున విషయానందము తుచ్ఛమని మఱచి యాత్మసక్తయై యుండును. ఇట్టి దశయం దాత్మ స్వరూపము తోఁ బ్రకాశించును. కొందఱు దీనినే పరిమావధిగాఁ దలంతురుగాని భక్తులు దీనితో సంతోష పడరు. ఇదియు జఘన్యమనియునట్టి యాత్మావలోకనమునఁ గలుగు నానందము మగనిని విడిచిన స్త్రీ యింటియం దేకాంతముగ నుండుట వంటిదనియుఁ దలఁచి భగవద్దర్శనమునకై ప్రయత్నింతురు. ఇట్టి భగవద్దర్శన లాభము భక్తులకే లభించును గని మఱియే యోగులకు లభింపదు. కాఁబట్టి నివృత్తిఫలము మోక్షానందము. ప్రవృత్తిఫలము జనన మరణ దుఃఖము. రెంటిలో నేది శ్రేష్ఠము ?

ప్రవృత్తిమార్గమందుఁ బయనించునా రిండ్లు, వాకిండ్లు, భూములు, పుత్రులు, ధనము, ధాన్యము, పెండ్లాలు, బిడ్డ లు, లోనైనవన్ని యన్ని మూటలుకట్టి తలపై నుంచుకొని పయనింపవలయును. ఇవి రావలయునని కోరిక, రాకుండి నఁ గ్రోధము, వచ్చినది పోయిన శోకము, వచ్చినది పోనీయరాదని లోభము. ఇవి యన్నియుఁ దన్ను రక్షించునని మోహము, ఇవి యుండిన మదము, ఇతరుల కుండిన మాత్సర్య మసూయ, ఇవియన్నియు వీరినిబీఁకి తనుచుండు ను. కావున నిందు సుఖము లేశమేని లేదు.

ఇఁక నివృత్తిమార్గమం దుండువాఁడో వైరాగ్యమను పదునైన కత్తిని చేతఁబూని మహారణరంగమునఁ దన్నడ్డగించు శత్రువుల నెల్లనఱకి త్రోవచేసికొని పోవు నసహాయ మహాశూరునివలె వెనుకఁ జూడక కామక్రో ధాదుల నెల్లనఱికి సంసారమున సంకెలలవంటి పెండ్లాల బిడ్డల జంజాటము వదలించుకొని భగవంతుని నమ్మి యే తగులాటము లేక నిర్భయముగ వర్తించువాఁడు. వీనికి శోకములేదు. మోహములేదు. భయములేదు. నిత్యతృప్తుఁడు ఇందు దుఃఖలేశము లేదు.

భారమాత్ర ప్రయోజనమై బాధాకరమునైన పెద్దమూట తలపై నుంచికొని కొండయెక్కుట సుకరమా ? చేతులూఁగులాడించుచు నెక్కుట సుకరమా ? కొండ యెక్కునపుడు తానై పాఱ వేయవలసిన మూట యదియే పడిపోయిన దైవకృపవలన భారము తొలఁగెఁ గదా. ఇఁక లఘువుగఁ బయనింప వచ్చునని సంతోషింపవలయు నా? పోయెనే యని దుఃఖింపవలయునా ? బుద్ధిగలవారి కేది కార్యము ?

జన్మము సార్థకము చేసికొన ననువగు నివృత్తి మార్గమునఁ బయనింప భగవంతుఁడు సౌకర్యము కలి గింపఁగా దానికై సంతోషింపక వగవవచ్చునా ?

వాస్తవ మారయ శోకింపవలసినవారము మనముగాము. మోయరాని మోపు తలపై నెత్తికొని కొండ యెక్కు వారి వంటి సంసారులే యెన్నఁ డీ భారము దొలఁగునా యని దుఃఖింపవలసినవారలు. వారు దానియందు సంతోషించుటయు సంతోషింపవలసిన మనము దుఃఖించుటయే మోహముచేతనే. విపరీత భావనచేతనే. ఏది మే లేది కీ డని తెలిసికొనఁదగిన తెలివి లేకుండుటచేతనే మేలును గీడని కీడును మేలని భావించుటచేతనే. కావున నిర్వాణ సుఖాభిలాషగల జ్ఞానులు మనదశ శ్లాఘింతురుకాని సంసారులదశ శ్లాఘింపరు. మనది శ్రేయోమార్గము. వారిది ప్రేయోమార్గము.

మనము మనమని నాతో సమముగ మిమ్మేల చెప్పుకొనెదె రందువేని వాస్తవముగ నీ దశకు నా దశకు భేదకములేదు. ఆలు చచ్చినవాఁడు విధురుఁడు మగఁడు చచ్చినది విధవ. రెండు కన్నులలో నే కన్ను పోయిననేమి? కుడికన్నుపోయినవారొకరు, ఎడమకన్ను పోయినవారు మఱియొకరు. విధవకేది హితచర్యయో విధురునకదియే హితచర్య. కావుననే నడుచు చర్యయే నీకును హితమైనది. భేదము కొంచమే.

మన దశ నికృష్టమైనదని యెన్నఁటకిని దలఁపకుము. మననడవడి నీచమైనచో మన దశ నీచమగును. భగ వత్సృష్టియందు నీచమైనదిలేదు. ఔన్నత్య నీచత్వములు సాంగత్యమువలనను నడవడివలనను లభించును.

ఒకఁడు కేవల నీచపదార్థ మేది యని విచారించి విచారించి తుద కమేధ్యము నీచమని తీర్మానించుకొనెను. అప్పుడది నానాతో నిట్లనియె. ఓరీ ! నేనుత్తముఁడనను గర్వము మానము. నాకు నీచత్వము నీ సాంగత్యమువలనఁ బ్రాప్తించినది కాని సహజముకాదు. నా సహజ స్వరూపముతో బియ్యము బేడలు కూరలు గాయలు చక్కెర నెయ్యి పాలు పెరుగు లోనగు రూపములతో నున్నప్పుడు నన్ను మీరే యెంతో పవిత్రమని పెట్టెలలో దాఁచి యాదరించుచుండి పవిత్రమని భోజ్యములుగఁజేసి దేవునకు నివేదించుచుంటిరి. అట్టి దేవతాయోగ్యమైన నేను నీ వాతఁబడి నీ కడుపులోఁ జొచ్చుటచే నీ సాంగత్యము లభించుటఁజేసి యి ట్లపవిత్ర పదార్థమైతిని. నా యపవిత్రతకుఁ గారణభూతు లెవ్వరు ?నీవే. ఇట్టి దశయందుఁగూడ నన్ను భుజించు జంతువులుగలవు. మీ గతియేమి ? చచ్చిన మీ రెవరి కుపయోగపడుదురు ?అనెను. అదివిని మనుష్యుఁడే పరమ నీచుఁడని వాఁడు తీర్మానించుకొనెను. ఆ మనుష్యుఁడే చక్కని నడవడిగలవాఁడగు నేని దేవతలను మించును.

మన యవస్థ పూజ్యమా యపూజ్యమా యనుటకుఁ బ్రత్యక్ష నిదర్శనములు చూడుము. ఇప్పుడు మునుపు కూడ నీ భర్తయుఁ దల్లి దండ్రులు నెదుట నుండినను లేకుండినను నీకు నీ తల్లిదండ్రులయందుండు భక్తివిశ్వా సములకంటెఁ గౌపీనధారినగు నాయం దెక్కువ ప్రీతి విశ్వాసములు కలదానవై వర్తించితివిగదా. ఇట్టి నే నే

జలతారు ధోవతులు కట్టుకొని,పట్టుపంచ యొల్లెవాటు వేసికొని,విరులు ధరించి,గంధము పూసికొని,యత్తరు గబ్బుతోడ వచ్చితినేని నీవు నన్నుఁ గన్నెత్తియైనఁ జూచి యుందువా? నీ సుఖ దుఃఖములు మనస్సులోని వేదన నాతోఁ జెప్పియుందువా ? ఏల ? ఇప్పటివాఁడనప్పుడుగానా ? అగుదును.చర్యభేదము.అట్టులే మేఘము నన్నె చీరయో రహస్యము దాఁపలేని జిలుగు దువ్వలువయోకట్టి కొర్నాటి రవికయో – మణికట్టు దాఁకు చొక్కా యో తొడిగి వంకర పాపటలు సోఁకు చెవులఁ గమ్మలు పెట్టి జాఱుపైఁటతో నొక విధవయు,ముఖమునిండ విబూది పూసిరుద్రాక్షలు మెడధరించి తెల్లని చీరధరించి యొక విధవయు నీయొద్దకు వచ్చి రేని వీరిలో నెవరు గౌరవార్హలుగ నీవు తలంతువు ?

ఒక ధనికుఁడు నొక సన్యాసి క్రొత్తయూరికిఁ బోయినలోకు లెవని నెక్కువగఁ బూజింతురు ? కావునఁ బూజ్యతా పూజ్యతలు నడవడినిబట్టి కలుగునుగాని దశలఁబట్టికాదు.పూజ్యదశయందున్నను శీల సంపత్తి లేనివారు పూజ్యులుగారు.తహశీల్దార్లుగా నుండి అంకాడఁబోయి చెప్పుదెబ్బలు తిన్న వా రెందఱులేరు.ఒక బ్రాహ్మణుఁడు తహశీల్దారు తురకదానితో సంభోగింప దాని యింటికేపోయి యుండు సమయంబున దాని మగఁడువచ్చి తలుపుతట్టెను.అప్పుడా తురకదా తహశీల్దారువారిని దలుపునొద్దకుఁ దీసికొనిపోయి తన రెండుకాళ్ళసందునఁ గూర్చుండఁ బెట్టుకొని తనపావడ జాఱవిడిచివానిమీఁదఁ గప్పి తలుపుతీసెను.తురకవాఁ డింటిలోనికిఁబోఁగానే తహశీల్దార్ల వారు చావు దప్పించుకొని పరువిడిరి.వీరి దశ వీరి గౌరవమును గాపాడెనా ? పెద్దయుద్యోగముల నిమిత్తమై తమ భార్యలను గలెక్టర్ల కర్పించిన పెద్ద మనుష్యులెందఱులేరు ? శీలముతోఁ గూడనిదశకు గౌరవము లేదు.కావున నీవు నీచదశ ప్రాప్తించెనని వగవకుము.నడవడివలన నీవు నీచురాలవు గాకుము.

లోకము నీ దశ నీచదశగాదని భావించు ననుటకు మఱియొక కారణము గలదు.భర్తలేని సతికి గంగా భాగీరథీ సమానురాలయిన యనియుఁ దిరుక్కా వేరీ సమానురాలయిన యనియు వ్రాయుట లోకాచారమై యున్నదికదా.ఈ విశేషణములు వ్రాయునుద్దేశమేమి ?గంగా–భాగీరథీ–కావేరి విధవలు కారుగదా ! గంగ–కావేరి పుణ్యనదులు.పవిత్ర తీర్థములు.సముద్రుని భార్యలు.అవి స్వతః పవిత్రము లగుటయేకాక యతరులను బవిత్రులను జేయుశక్తి గలవి.అట్టిపవిత్రత నీకునుగలిగినది.నరకద్వారమగు గ్రామ్యధర్మపీడ నీకుఁ దొలఁగినది.మోక్షసాధన మైన బ్రహ్మచర్య వ్రతము నీకు లభించినది.ఆ మూలమున నీవు పవిత్రమై యితరులను బవిత్రులఁ జేయఁగలుగు దురు.ఇట్టి యోగ్యత గలుగుట నీచలక్షణమా! కావునఁ దల్లీ ! నీకు నీచదశ లభించెనని విచారపడకుము.

నా సొమ్ములు చీరెలు నాకే పగాయెను.తిండికిని దొంగనైతినని తలఁపకుము.స్వవిషయము చెప్పుచున్నాన ని కాని యాత్మప్రశంస చేసికొనుచున్నానని కాని యెంచకుము.అట్టి అభిప్రాయము నాకు లేదు.నీకు మనస్సున నాటునట్లు నిదర్శన పూర్వకముగఁ జెప్పవలయుననియే నా యభిప్రాయము.నీ కిప్పుడు లభించిన దశవంటి దశయే నాకు 1910 యందు ననఁగా నిప్పటికిఁ బదునేను సంవత్సరములకు ముందు లభించెను.ఏదశయందు భగవంతుఁడు నన్నుంచెనో యాదశ కుచితమైన కార్యములు చేయవలయు ననియేనా మతము.అదియే నీకును బోధించెదను.నా నడవడి సరియని నీకుఁ దోఁచెనా నీవు నట్లేచేయఁ గ్రమక్రమముగ యత్నింపుము.సరిగాదని తోఁచిన విసర్జింపుము.అసాధ్యమని యెన్నఁటికి ననకుము.1912 లోనే నాహారము మానఁ బ్రారంభించితిని. 1913 లోఁ బూర్ణముగ సాధించితిని.1914 లో నేను బదరి కాశ్రమమునకుఁ గేవల ఫలహారినై యే పోయివచ్చి తిని.అట్టులే వస్త్రత్యాగమును గావించితిని.ఉద్యోగములో నున్నప్పుడే కలాశాలకుఁ బోవునప్పుడు తప్పఁ దక్కిన వేళల నింటనుండు నపుడు కౌపీనధారియు వెలుపలఁ బోవునపుడు దీర్ఘ కంచుక ధారియునైయుంటిని.ఇప్పటి నా స్థితి నీ వెఱుఁగుదువు.ఉడుకని కూడుఁవడకబట్ట నా యిప్పటి యాదర్శములు.రామకార్యమునకు భంగము వచ్చునేమో యను భీతిచే రెండవది యాచరణమందుంచలేక జంకుచున్నాను.నాకు శత్రువులనియా కడుపునిండఁ గూడు నొంటినిండ బట్ట వదలితిని.వాని ననుభవింప వలయుననిన ధనము లేదాయెనా ? చేతరాదాయెనా? కూటిమీఁదియాశయుంచుకొని యేయమ్మ యింతవేళకుఁ బిండ ముడికించి వేయునా ? ఏతల్లి యింతతలకు వేఁడినీళ్లు పోయునా ? యని యొకరి దయ కెదురుచూచుచు, నీ కార్యములకై యొకరినుంచుకొని యుంచుకొనిన పిమ్మట నది చక్కఁగఁ జేసినను జేయకున్నను నే పనికి మాలిన చేష్టలు చేసినను వేఱుగతిలేక సహించుచుఁ బిడికెఁడు పిండమునకై పరాధీనపుబ్రతుకు బ్రతుకుచు నుండుట సుఖమా ? తిండిమాని యాదృచ్ఛికముగ లభించిన పండో కాయో యాకో యలమో యాఁకలివేళకుఁ దినియేటనో బావినో గుంటనో యిచ్చవచ్చినట్లు మునుఁగుచు "కాపీనంశతరంధ్ర జర్జరత ర" మ్మన్నట్టు చినిఁగిన గోఁచియు విధిలేక వచ్చినప్పుడు రెండు మూరల గుడ్డయు ధరించి చేయితలదిండుగా నేల పాన్పుగాఁ బవళించుచు నావలన నొకరికి శ్రమములేక యొకరివలన నాకును శ్రమములేకయుండు నా బ్రతుకు సుఖమా నీవే చెప్పుము.భార్యలు వచ్చిన వా రనేకులు పడు పాటును నా పాటును జూచితివేని సంసారపద్ధతి బాగో విరక్తిపద్ధతి బాగో తెలిసికొనఁగలవు.అంతియగాక నేను నడవఁదలచిన మార్గమునందు ధనధాన్యాదుల నావశ్యకములు.కావున మనసార వదలితిని.కాఁబట్టి

యవి పోయెనని శోకములేదు. నీకు బలవంతముగఁ బోవుటచే నీవు శోకించుచున్నదానవు. పదిరూపాయలు దొంగలెత్తుకొనిపోయిన వగతువు. నీచేతులారనీవు పదివేలు దానముచేసితివేని వగతువా ?మన తారతమ్య మీ మాత్రమే.

ఒక శిశువునకు వ్యాధి వచ్చెనేని తల్లి యా శిశువును దన కాళ్ళపై వేసికొని కాలుసేతులు బిగఁబట్టి యుగ్గుగిన్నెతో నోర బలవంతముగ మందుపోయును. తన కేదో పెద్ద విపత్తువచ్చినట్టు లా బిడ్డ యిల్లెత్తుకొనిపోవ నేడ్చును. ఏల? ఆ మందు తన వ్యాధి నివారణమునకుఁ దన క్షేమమునకుఁ దన తల్లియే యిచ్చుచున్నదని బిడ్డ యెఱుఁగదు. అప్పుడు తన తల్లగూడఁదనకుఁ గీడు చేయుచన్నదనియే యా బిడ్డ తలంపు. ఆ తల్లియే తనకు వ్యాధివచ్చినపుడు దానికిఁ దగిన యౌషధము నెఱిఁగియుండినఁ దానే దానిని దీసికొనును. మన యిరువుర కిదియే భేదము. భగవంతుఁడు మన మేలునకై కలిగించిన దశ చెడ్డదని యజ్ఞానమున నీవేడ్చెదవు. మంచిదనియు నిట్టి తరుణము వ్యర్థముగఁ బోనీయక చేతనై నంత కృషిచేసి బాగుపడవలయుననియు నేను శ్రమించుచున్నాను.

అట్లైన నా కీ దశ నా మేలునకే లభించిదందురా యనెదవేమో. నీవు బుద్ధిగలదానవైతివేని సత్యముగ నీ మేలునకు,నీ భర్త మేలునకు, నీ తల్లిదండ్రుల మేలునకు,నీ యత్తమామల మేలునకు లభించిన దనియే తలఁపుము.

ఎట్లుమేలనెదవా ? నీకిఁక యావజ్జీవ బ్రహ్మచర్యవ్రతము. బ్రహ్మచర్యవ్రతమువలన స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని దేహమునకుమనస్సునకు వివాహమునందుఁబరమునందుఁ గలుగు మే లింతంతయనినేనుజెప్పలేను. ఇతరసాహాయ్యములేనిబ్రహ్మచర్యమువలననే యిహపరములు రెండును సాధింపవచ్చును. బ్రహ్మచారులైన హనుమద్భీష్ముల బలపరాక్రమ మేధాశక్తుల నాలోచింపుము. ఆయువు సత్త్వము బలము ఆరోగ్యము సుఖము ప్రీతిలోనైనవన్నియు బ్రహ్మచర్యము వలననే లభించును. బ్రహ్మచర్యములేని యే యాశ్రమము వ్యర్థము. అన్ని జపములకు నన్నితపములకు నన్ని యోగములకు నన్ని యాశ్రమములకు బ్రహ్మచర్యము ప్రాణము. బ్రహ్మచర్య వ్రతభ్రష్టుఁడన్నిట భ్రష్టుఁడే. అట్టిది తనంత లభించుటే మేలుకదా. రెండవది కాలవిరామము. నీవు బుద్ధిమతివైతివేని యావత్కాలము నితర విచారములేక యే జంజాటములేక భగవచ్చింతనమందే. వినియోగింపవచ్చును. మూఁడవది పరిణామమున నుత్తరోత్తరాభివృద్ధికి సేవయే కారణమని నే నిదివఱకే తెలిసియున్నానుగదా. నీ విఁక దయావతి వైతివేని స్వప్రయోజనము నాశింపక స్వలాభాపేక్షలేక యింటివారికిఁగాని పరిచితులగువారికిఁగాని యెన్నివిధములనో సహాయపడ వచ్చునుగదా?తెలివిగలిగి ప్రవర్తించువారికి వీనికి మించిన లాభమేదిగలదు. అంతియకాదు. నీవొక తెవు సంసారసాగరమునుండి తరింపఁగలిగితివేని నీ నెపమున నీయందు బ్రీతిగలవారందఱును దల్లిదండ్రులు మగఁడు లోనగువారును మోక్షసామ్రాజ్యమున కర్హులగుదురు. సంసారులిట్టి కార్యము చేయఁగలరా ?

శిశువున కౌషధమువలె నా కీ దశయంటిరే నా యే రోగమున కిది యౌషధము ? ఇంత చిన్నవయస్సులో నిట్టిశిక్షయనుభవింపవలసినంత పాపము నే నేమిచేసితిని? నాభర్తను జీవింపఁజేసియే భగవంతుఁడు మమ్ము మోక్షమార్గగాములఁజేయరాదా? యందు వేమో చెప్పెద వినుము. దేహి పరిణామక్రమమును సీతాదేవిచరిత్ర యందును,ఆర్యకథానిధి యెనిమిదవ భాగమందును,టెంకాయచిప్ప శతకపీఠికయందును వ్రాసితిని. అవి నీవు చదివితివి కావున దానిని గుఱించి మరలఁ జెప్పవలసిన పనిలేదు. అట్లు పరిణామక్రమమున నీ భూలోకమున జనించిన జంతువులలో మనుష్యుఁడు శ్రేష్ఠుఁడు. ఏల ? మాటలాడువాఁడు మనుష్యుఁడు నవ్వువాఁడు మనుష్యుఁడు మనమేల పుట్టితిమి ? పుట్టకముందెచ్చట నుంటిమి?చావనేల?చచ్చినవారెచ్చటికిఁ బోవుదురు ? ఆవల వారిగతి యేమి ?అని యీవిధముగ నాలోచింప శక్తిగలవాఁడు మనుష్యుఁడు. పుణ్యపాప జ్ఞానముగలవాఁడు మనుష్యుఁడు. నిత్యనీతులెఱిఁగిన వాడు మనుష్యుఁడు. తక్కినజంతువులకంటె మనుష్యుల యందుండు నెక్కువ గుణ మిదియే. ఆహార నిద్రాభయ మైథునములు పశుపక్ష్యాదులకు మనుష్యులకు సమానములు. కావున నెక్కువగ మనుష్యున కబ్బిన యీ జ్ఞానశక్తిని వినియోగింపఁడేని మనుష్యుఁడు మనుష్యుఁడు కాఁడు. ద్విపాత్పశువు.

మన మేల పుట్టితిమి ? మన కిది యొకటియే జన్మమా ! ఇంతకుముందు వెనుకల జన్మములు గలవా? ఈ జననమరణముల యుద్దేశము ప్రయోజనము నేది ? పుట్టి యేమి చేయవలయును? చేయకుండిన నేమి కీడు ? చేసినఁగలురు లాభమేమి ?యని యీవిధముగ నాలోచించి కర్తవ్యములైన క్షేమంకరకార్యములు చేయవలసినది మనుష్యుల కందఱకు విధియై యున్నది.

మనము పూర్వజన్మములందుఁ జేసిన పుణ్యపాపముల ఫల మనుభవించుట యీజన్మ మెత్తితిమి. పూర్వ జన్మంబుల మనముచేసిన పుణ్యఫలమే యిప్పుడు మనమనుభవించు సుఖము. పూర్వజన్మములందు మనము చేసిన పాపముఫలమే యిప్పుడు మన మనుభవించు దుఃఖము. "తేన వినాతృణాగ్రమపి నచలతి" యని యుండుటచే భగవదాజ్ఞచేతనే సర్వప్రపంచ వ్యవహారములు జరుగుచుండును గావున నాకస్మికమనునది నిష్కారణమనునది లోకంబున లేదు. కారణము మనకుఁ దెలియనపుడు మన యజ్ఞానమును నంగీకరించుటకు మాఱుగ నట్టి పదము లుపయోగింతుము. కారణము లేనివాఁడు భగవంతుఁడొక్కఁడే. కారణము లేక కార్యము కలుగనేకలుగదు.

ఇట్లగుటచే నీ కీ కష్టదశ వచ్చుటకుఁ గారణమొకటి యుండవలయును గాని లేకుండదు.

యథా కారీ యథా చారీ తథా భవతి సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి. పుణ్యః పుణ్యేన కర్మణాభవతి పాపః పాపేన అథోఖల్వాహుః కామ మయ ఏవాయంపురుష ఇతి సయథా కామో భవతి తత్క్ర తుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మకురుతే, యత్కర్మకురుతే తదభి సంపద్యతే (బృహ-6-4-5) యని యుపనిష ద్వాక్యములు.

భార్యాభర్తల కవినాభావసంబంధము గలదనియు నెన్నిజన్మంబులకయిన భార్యాభర్తలు మాఱరనియుఁ బతి సతీహితచర్య లందు నేను వ్రాసినది చదివితివిగదా. భార్యయే భర్త కాత్మయనియు,భర్త దేహమున సగము భార్యయనియు,భర్తచేసిన పుణ్యంబున సగము భార్యకు వచ్చుననియు భార్యచేసిన పాపంబున సగము భర్తకుఁ బోవుననియు నెఱుఁగుదువుగదా. పురుషుఁడు తానుజేసిన పాపమునకే గాక తనభార్యచేసిన పాపమున సగమున కును నరకమనుభవింపవలయును. భార్య తానుజేసిన పాపమున సగమున కే శిక్ష యనుభవించి తన పుణ్యము నకుఁ దోడు భర్త చేసిన పుణ్యమున సగము రాఁగా సుఖ మనుభవించును.

ఈ కారణముచే భర్త యాయువును దుష్టభార్య మ్రింగునది యగును. కావున దానిభర్తముందు చచ్చును. ఈ విషయమునే సీతాదేవి. "సతిచేసిన పాపంబునఁ బతి తొొలుతఁ జచ్చు" నని చెప్పెను. స్త్రీ తాను జేసిన పాపఫలముగ వైధవ్య మనుభవించును. నేను బాపిని నగుదును గాక,కొంతకాలమైన తరువాత నిది రాఁగూడదా - ఇంత బాల్యముననే యేల రావలయును? అట్టి ఘోరపాపము నేనేమి చేసితినని యందునేని "కేనవై బాల వైధవ్యం కథయస్వజనార్దన"యని యర్జునుఁ డడుగఁగా "పరసంగ రతా నారీ బాలరండాతుజాయతే" యని కృష్ణుఁడు ప్రత్యుత్తరమిచ్చెనని భవిష్యోత్తరపురాణంబునఁ గర్మగీతలయందుఁ గలదు. దీనివలన బాలవైధవ్యమునకు జారిణి యగుటయే కారణమని శాస్త్రమువలనఁదెలియవచ్చెడిని. ఇతర విధముల భర్తలను బీడించి బాధించినవారు కొంతకాలము సంసారసుఖమనుభవించి పదపడిభర్తలను గోలుపోవుదురు. మఱియును,

శ్లో. ఋతుస్నాతా యదానారీ, భర్తారంనో పసర్పతి ।
సామృతా నరకం యాతి,వైధవ్యంచ పునఃపునః ॥

ముట్టు స్నానముచేసిన స్త్రీ పతితోఁ గలియదేని మరణించి నరకమునకుఁ బోవును. మరల మరల విధవ యగును.

జారత్వమునకు వైధవ్య మెట్లు శిక్ష యందువేమో. కామమదమే జారత్వమునకుఁ గారణము. ఆకఁలి యుండియు నన్నము తినలేకపోవుటవలెఁ గామముండియు దాని ననుభవింప నీ కుండుటే దానికిఁ దగిన శిక్ష గదా. అటైనచోఁ గొందఱు విధవలు రహస్యముగ వ్యభిచరింపఁగాఁ గొందఱు వివాహమను పేర బహిరంగమున వ్యభిచరించు చున్నారే. వారలగతియేమి ?ఒకఁడు దొంగతనము చేయఁగా వానికి న్యాయాధిపతి యొక సంవత్స రము చెఱసాలయందుండ విధించెననుకో. ఈ చెఱసాల యందుండు కాలమున మరల దొంగిలించెనేని వానినేమి చేయుచున్నారు ? ఎక్కువగఁ గఠినతర శిక్ష విధించుచున్నారా లేదా. అట్లే కామమణఁచుకొని బాగుపడవలయునని భగవంతుఁడు వైధవ్యశిక్ష విధింపఁగా మరలఁ గామమదమున కన్నుగానక వ్యభిచరించెనేని యా యాఁడుది మఱుజన్మంబున నింతకుఁ గఠినతరమైనశిక్షకుఁ బాలుపడును. ఎట్లందువేని నా యనుభవమునకు వచ్చిన యొకతె విషయము చెప్పెదను.

ఒకానొక నా పరిచితున కొక చిన్నభార్యగలదు. ఆమె పెనిమిటి ధనవంతుఁడు. రూపరి. యౌవనవంతుఁడు. విశాలమైన మేడయిల్లు, ఇష్టభోగ్య పదార్థములన్నియు నింటినిండనవారిగఁగలవు. కట్టను-బెట్టను-గుడువును నే కొఱఁతయులేదు. ఇన్ని యుండియునేల?పురుషులఁజూచి గ్రుక్కిళ్ళు మ్రింగవలసినదే. సంభోగమున కేకారి చావవలసినదే. ఒకనాఁడు మగని యొద్దఁ బరుండెనేని యాఱు మాసములు మంచము విడిచి లేవవలసిన పని లేదు. మామగారు వైద్యము చేయరానిచోట వ్రణము. ఆపుండు మానుటలేదు. ఏమాత్రము రాపుదగిలినను బచ్చిదై చీము,నెత్తురు గాఱ నాటు పోటు మంట, సహింప రాకుండెను. తరువాత వైద్యులు వచ్చుట,కడుగుట,పట్టీలువేయు ట లోనైన కర్మకాండము చెప్పవలసినపనిలేదు. పోయిన జన్మమున విధవయై వ్యభిచరించుటచే నిట్టిశిక్ష గలిగెఁ గాఁబోలు నని దానిని జూచినప్పు డంతయుఁ దలఁచుచుంటిని. ఆవల నది విధవయే యయ్యెను.

మనము చేయు కర్మము పుణ్యముగాని పాపముగాని మనస్సుచేఁ జేసినను వాక్కుచేఁ జేసినను,దేహముచేఁ జేసివించియే తీరవలయును. గోడమీఁద జెండుకొట్టిన నెట్లు మిడిసి మనఁమీద బడునో యట్లే కర్మఫలము కర్మము చేసినవానిపై తగులునుగాని తప్పదు. నవ్వుచుఁ జేసిన నేడ్చుచు ననుభవింపవలయును.

ఇఁక నెవ్వరి నుద్ధరించుటకై నేను బ్రతికి యుండవలయునంటివి. ఉద్ధరించుట యనుమాటకు నీ కర్థము తెలియునా ?క్రిందఁబడిన వారిని బైకి లేవనెత్తి పట్టుకొనుటయని యామాటకర్థము. (ఉత్+దరించు=ఉద్ధరించు) ఇది రెండు విధములఁ జేయనగును. ఐహికముగ నొకటి. రెండవది యాముష్మికముగ. కూటికి గుడ్డకు లేని

పెదకు వానినిచ్చి జీవనోపాయము గల్పించి పోషించుట యైహికము. ధనికుండైనను ధనహీనుండైనను సజ్ఞానాంధ కారమున మునిఁగి యైహికవిషయవాంఛలమరగి గ్రుడ్డివానివలె నుండు వానికి జ్ఞాన ముపదేశించి కన్నులు తెఱపి సంసారస్థితి యున్న దున్నట్టు తెలిపి మోక్షాసక్తునిఁ జేయుట యాముష్మికము. ఈ రెంటిలో నీ మగఁడు బ్రతికియుండెనేని నీవు చేయఁగల దేదో యిప్పుడు చేయఁజాలని దేదో చెప్పెదవా ? ఉన్న ద్రవ్యమును నీ మగఁ డెత్తు కొని పోలేదు గనుక బీదల రక్షించుటకుఁ గావలసిన ధనముండెనా. యా కార్య మప్పుడు చేయవచ్చు ను. ఇప్పుడు చేయవచ్చును. అజ్ఞానులను జ్ఞానులుగఁ జేయుశక్తి యుండెనా యది యిప్పుడిప్పుడు నుపయోగింప వచ్చును? దైహికము నికృష్టము–ఆముష్మికము శ్రేష్ఠము.

కం. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికివిధిహితముగాఁ బ్రసాదము (జనితము) చేయం
గా నది సకల ధరిత్రీ
దానంబునకంటె మిగుల ఫలతర మరయన్. భార.

బీదసాదుల రక్షింపఁ జాలినంత ధనము నీయొద్ద లేదు. నీవు సంపాదింపను లేవు. ధన మెవరికెంత ప్రాప్తము కావలయునో యంతే యగునుకాని కాసైన నెక్కువరాదు.

చం. వనజభవుండు నెన్నొసట వ్రాసినసొమ్ము ఘనం బొ
కొంచెమో ! విను మరుభూమి కేగిన లభించును, మేరువుఁ
జేరఁబోయినన్ ! ధన మధికంబురాదు, కడుదైన్యము
మాను ధనార్థులందు; నవ్వననిధి నూతఁదుల్యముగ వారి
గ్రహించు ఘటంబు చూడుమా. భర్త్ర.

ఒక కడవను బావిలో ముంచిన నెంత నీరు పట్టునో సముద్రములో ముంచిన నంత నీరే పట్టును. స్వర్గా ది ఫలములు గోరి పుణ్యముచేయు తలంపుతో దానధర్మములు చేయుటకన్న ధనాశనే జయించుట ప్రశస్తము. తాను సర్వముఁద్యజించి స్వలాభముఁ గోరక కేవల భగవత్కైంకర్య బుద్ధితో లోకోపకారక కృత్యంబులకై యార్జించి వెచ్చింపవచ్చును. ధనముతోడి చెలిమి దహనముతోడి చెలిమి సమానములు. వైరాగ్యమనెడి సాధనములేక ధనముతో నాడుకొను వాఁడు చెడుటకు సందేహములేదు. విరాగియైనను విధిలేక మీఁదఁజెప్పిన సందర్భమునఁ దప్పఁ దక్కిన కారణములచే ధనముఁగూర్పఁ దలఁపరాదు. వచ్చినది వచ్చినట్లు వెచ్చింపవలయును గాని నిలువయుంచు కొనరాదు. కామినీ కాంచనములు రెండును బురుషునకుఁ బతనహేతువులే. అట్టులే పురుష ధన సాంగత్యములు స్త్రీలకును అరటియాకువంటిది యాఁడు జన్మము. ముల్లరఁటి యాకునకుఁ దగిలినను నరఁటియాకు ముంటికిఁ దగిలినను జెడునది యరఁటియాకే.

శ్లో. అర్థ మనర్థం భావయ నిత్యం
నాస్తి తతః సుఖలేక స్సత్యమ్
పుత్రా దపి ధన భాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః.

అని యాది శంకరులు వచించిరి గదా.

మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమ యను వాక్యము సత్యమే సుమీ. కనుక నీవు ధనమార్జించి లోకము నుద్ధరింపులేవు. అట్టి యాసక్తి యుండినను నది నికృష్టమైనది కావున బాగుపడఁ గోరువారికి ప్రశస్తము నుగాదు.

రెండవది :– జ్ఞానమార్జించి యజ్ఞానుల నుద్ధరించుట.

ఈ కార్యము నీవు మునుపటికంటె నిప్పుడే బాగుగఁ జేయ ననుకూలత గలదు. ముత్తైదువగ నున్నప్పుడు సగము కాలము నీకు దేహసంస్కారమునందే వ్యర్థమై పోవుచుండెను. కామాసక్తియు నిన్నెక్కువగఁ బీడించుచుండె ను. దానికిఁగావలసిన కార్యములు చేయుచుండవలసియుండెను. ఇప్పుడా పీడలులేవు కాలమంతయు భక్తిజ్ఞానార్జన మందును భగవత్సేవయందును గడపవచ్చును. ఆనందానుభవమే కాంక్షితమైన యెడలఁ గామముచేఁ గలుగు క్షుద్రము నశాశ్వతమునైన దానిని గోరుట మేలా ? శాశ్వతాత్యంతానందమునకై యత్నించుటమేలా ? తీటకురుపులు జిలయెత్తినపుడు గోకుటవలనఁ గలిగిన సుఖమును సుఖమనెదవా? విషయానందముగాని బ్రహ్మానందముగాని కష్టపడక లభింపదు. విషయానందము వలయునన్న నెన్నియో పదార్థములు సంపాదింపఁ గుక్కపడని పాటులన్ని యుఁ బడవలయునుగదా. బ్రహ్మానందము సంపాదించుటకు బాహ్యపదార్థ మొక్కటియుఁ బనిలేదు. ఉన్నవాని నన్నిటిని విసర్జింపవలయును. ఆర్జించుట సులువా ? బ్రహ్మానం దార్జనమునకుఁ గావలసిన సాధనము మనస్సా క్కటే. నీ మనస్సు నీ స్వాధీనమం దుండెనా దానిని నీవు సరియైన మార్గమున నడిపించితివా పదునాలుగు లోక

ములేల? వానిపై లోకములను జయింపఁగలవు. కావున నేను బ్రతికి యెవరి నుద్ధరింతుననుటకుఁ బ్రత్యుత్తర మేమన నిన్ను నీ వుద్ధరించుకొమ్మనుటయే. నిన్ను నీ వుద్ధరించుకొనఁగలిగితివేని వెంటనే నీ మగని నుద్ధరించిన దాన వగుదువు. నీవు చెడుటచేఁగదా యాయన కా కష్టదశ వచ్చెను. నీవు బాగుపడిననాయనయు బాగుపడును. ఒక దేహములో సగము దేహము చెడినచోఁ దక్కిన దేహము బాగుండినను జెడినట్టేకదా. కావున నిన్ను నీవు చక్కఁ బఱుచుకొంటివేని యాయనయుఁజక్కఁబడును. అంతియకాదు. నీ వాత్మజ్ఞానము గలదానవై శీలవతివై యుందు వేని భగవంతుఁడు నీకు శోకదుఃఖములు రానీయకుండుటకై యాయనను రక్షించు చుండును. ఆత్మజ్ఞానము శీలము గలిగి శాస్త్రవిహితమైన మార్గమందుండు నాకు నీ వెట్లు శోకము గలిగెంచెదవని సావిత్రి యడిగినపుడు యముఁడు ప్రత్యుత్తరము చెప్పలేక పోయెఁగదా. ద్రౌపది శరణాగతి చేసిన కారణమునఁగదా పాండవుల కే యాపద లేకుండునట్లు కృష్ణుఁడు వారలఁ గాపాడెను. కావుననే,

"మగఁడు పతితుఁడైన మగువ పాతివ్రత్య మహిమఁ బుణ్యుఁజేసి మనుపవలయు."

నని భాగవతము బోధించుచున్నది కావున నిన్ను నీ వుద్ధరించుకొనుదువేని నీ మగని నుద్ధరించినదాన వగుదువు. నీవు ధనార్జముచేసి దానధర్మములుచేయఁ బూనినను వానివలన నింతకార్యము చేయఁజాలవు అంతి యకాదు. నిన్ను నీ వుద్ధరించుకొంటివేని నీ తల్లిదండ్రులను నుద్ధరించినదానవగుదువు. "పుత్రాత్ దశగుణంపుత్రీ" యని శాస్త్రవాక్యము. కూఁతురు శీలవతియగునేని కొడుకునకన్నఁ బదియంతలు మేలు. నీవు జ్ఞానవతివైతివేని నీ వలన తల్లిదండ్రులును దరింతురు.

ఒక స్త్రీ చెడునడవడిగలదయ్యేనేని మగనివంశమువారిని దల్లివంశమువారిని దండ్రి వంశమువారిని నరకమునఁ ద్రోయును. శీలవతియగునేని యీ మూఁడువంశములవారిని నుద్ధరించును. కాఁబట్టి నిన్ను నీ వుద్ధరించుకొనుట యెంత మావశ్యకమో తెలిసెదనుగదా.

ఈ యుద్ధరణకార్యము మనుపటికంటె నిప్పుడు చక్కఁగఁ జేయ గలవని తెలిపితినిగదా. కావున దైవికముగ లభించిన యీ యనుకూలసమయమును దప్పఁగొట్టరాదు.

నా మగఁడు చచ్చి యెందో పోయెను. నా నడవడి యాయన కెట్లు సుఖదుఃఖ కారణము కాఁగలదని నీ వనరాదు. ఏలన?

నేను–నా యనునవి నీ దేహమునం దన్వయించునా? జీవాత్మయం దన్వయించునా? దేహమం దందువేని నా దేహమన్నప్పుడు దేనియం దన్వయించును ? తా ననునది యొకటి దేహమనునది యొకటి రెం డేర్పడెనుగదా అంతేకాదు. మగఁడు మరణించిన వెంటనే భార్యయు మరణించె ననుకొమ్ము అప్పుడు మగవానిదేహము తన భార్యపోయెనని యేడ్చునా? స్త్రీ దేహము నా మగఁడు పోయెనని యేడ్చునా? కావున నేను నా యనునది జీవాత్మ యం దన్వయించునుగాని దేహము నం దన్వయింపదు. కావుననేకదా మగనికి జీవితేశ్వరుఁడు ప్రాణేశ్వరుఁడు హృదయేశ్వరుఁడు నని పేర్లు. పుట్టునది చచ్చునది దేహమేకాని జీవుఁడు కాఁడు. జీవునకుఁ బుట్టువులేదు. చావు లేదు. కావున వాస్తవార్థమున నీ మగఁడు చావలేదు. పోయినది నీ మగని స్థూలదేహమే. స్థూలదేహమునకు స్థూలదేహమునకుఁగల సంబంధమునుబట్టి యా దేహ సంబంధమువలన నీ దేహమునకు లభించిన యలంకారా దులు పోయినవి. నీయందు జీవుఁడెట్లున్నాఁడో యాయనయు నట్లే యున్నాఁడు. స్థూలదేహముమాత్రమే పోయినది నీ మగఁ డున్నాఁడనుటకు శాస్త్రవాక్యములు నేనుపన్యసింపవలసిన పనిలేదు. స్వప్నమందు నీ మగఁడు నీకుఁ గనిపించి నీకై యొకటి నేను దాఁచియుంచినాను. ఆ పెట్టె తెమ్మని చెప్పఁగా నీవు తెచ్చినట్టును ఆయన యా పెట్టెతీసి యం దడుగునఁ బదిలముగ దాఁచి యుంచిన యొక చీటితీసి యిదినీకుఁ దారకము దీనిని మఱపకు ము విడువకుమని చెప్పి నీ చేతికిచ్చినట్టును దానిని విప్పిచూడఁగా శ్రీరామనామము వ్రాసియుండినట్టును నీవే చెప్పితివిగదా. నీ మగఁడు చచ్చియేయుండిన నీ కెట్టు లీగతి బోధింపఁగలిగెను? కావున నీ మగఁడు మరణింప లేదనియు నీ మీఁది ప్రీతియుఁ బాయలేదనియు నీవు నమ్మవచ్చునుగదా. అంతియగాక మునుపటివలె నగలు ధరించియుండు నిన్నుఁజూచి యింకను నివి నీకేల తీసివైవుమనియు నేవో (వానిపేర్లు మఱచితిని) రెండుమాత్ర ముంచుకొమ్మనియుఁ జెప్పెనంటివికదా. దీనియర్థమేమో, నేను జెప్పెడు మార్గము సరియైనది యగునో కాదో నీవే యాలోచింపుము. ఇట్టి దర్శన నిదర్శనములు మఱికొన్ని నే నెఱుఁగుదును. బదరీ నారాయణమునకుఁబోయి బ్రహ్మకపాలములోఁ బితరుల కందఱకుఁబిండములు వేయవలయునని ప్రయాణమై హరిద్వారము దాఁటిపోవు చుమార్గమధ్యమున నే నెవరెవరికిఁ బిండములు వేయవలయునా యని యాలోచించి యందఱ నామములు పట్టిగా నాగుర్తు పుస్తకమునవరుసగా వ్రాసితిని. చచ్చిపిమ్మట నాకెన్నఁడంతవఱకుఁగనరాని నా భార్య యా పట్టీ వ్రాసిననాఁటిరాత్రి యేడ్చుచుఁ గలలోఁగానవచ్చెను. ఏమి కారణమని యాలోచింపఁగా నేను వ్రాసినపట్టీలో దానిపేరు వ్రాయమఱచితిని. తరువాతవ్రాసితిని. క్రొత్తపల్లె పద్మనాభశాస్త్రులవారి భార్యకు నాయన కలలయందు వచ్చియామె నూఱడించుచుండెను. కావున నీ మగఁడు స్థూలదేహమును విడిచిపోయెనేకాని మరణింపలేదనియు

మీభార్యాభర్త్ర సంబంధము తెగలేదనియు నీ రాకకై యాయన స్వర్గమున నెదురుచూపచుచుండుననియు నీనడవడివలన నాయనకు నరకదుఃఖమో స్వర్గసుఖమో లభించుచుండుననియుఁ బ్రారబ్ధానుభవముచేఁ బాపరహితవై సౌశీల్యాదులచేఁ బుణ్యవతివై యీ దేహము విడిచిపోయి స్వర్గమున నాయనను గలిసికొని యక్కడి యనుభవములు ముగియఁగనే మీ రిరువు రెండెందు జన్మించిన మరల భార్యాభర్తలుగ నగుదురో యట్టి దేశంబుల నట్టి వంశంబుల నట్టి జననీజనకుల కుదయించి మరల నీ లోకంబున భార్యాభర్త లగుదురనియు నిట్టు లే మోక్షాధికారము గలుగువఱకు జరుగుననియు నొకరికి మోక్షమిచ్చినయెడలఁ దత్సాంగత్య బలమున రెండవవారికిని మోక్షమబ్బుననియు నెఱుంగుము. కావున నా మగఁడు చచ్చి యెందోపోయెననట భ్రాంతియే కాని సత్యముకాదు.

ఆయన యెందున్నాఁడో నే నెందున్నదాననో నా నడవడి యాయనకు సాధక బాధక కారణ మెట్లగు ననకుము.

బృహదారణ్య కోపనిషత్తునందలి యీ మంత్రముల వినుము 1-4-3.

సనైవ రేమే తస్మా దేకాకీ నరమతే సద్వితీయమైచ్ఛత్ సహై తాహనాసయథాస్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌస ఇమ మే వాత్మానం ద్వేధా పాతయ త్తతః పతిశ్చ పత్నీశ్చా భవతాం తస్మాదిదు మర్ధబృగళమివస్వ ఇతి. దీని యర్థమేమన :-

ఆయన సంతోషింపఁడయ్యె. కావున నేకాకికి సంతోషములేదు. ఆయన రెండవది కావలయునని కోరెను. స్త్రీ పురుషులు నొండొరుఁ గౌఁగిలించుకొనిన నెట్లుందురో యాయన యట్లుండెను. ఆయన తన్ను రెండుగాఁ బడునట్లు చేసికొనెను. ఆ రెంటినుండి పతియుఁ బత్నియు నైరి. కావున నివి విత్తనములోని రెండు చిప్పలవంటివి.

ఈ రెం డనునవి చంద్రుఁడు వెన్నెల-సూర్యుఁడు నెండ-సాలెపురుగు ప్రోగులు వలెనని యెఱుంగవలయు ఈ యర్థము "అనన్యాహి మయా సీతా భాస్క రేణ ప్రభాయథా" యుద్ధ. "అనన్యా రాఘవేణా హంభాస్క రేణ ప్రభా యథా" సుందర. ఈ రామాయణ వాక్యంబులవలన నెఱుఁగనగు. ఈ యర్థమునే శివుని యర్ధనారీశ్వరత్వము దెలుపుచున్నది. విష్ణో రేషానపాయనీ యన్నట్టు లక్ష్మీనారాయణుల కవిశ్లేషమును నారాయణు వక్షస్థలమున లక్ష్మి యుండుట తెలుపును. రాముఁడు వనములో సీత లంకలో,రాముఁ డయోధ్యలో సీత వైకుంఠములో నుండినను విశ్లేషమెట్లు లేదో యట్లే పతివియుక్త సతీ వియుక్త భార్యాభర్తలని యెఱుంగుము. దూరదేశమున నున్నప్పుడు నాకు భర్త లేఁడని యాయయనకు నాకు నేమిసంబంధమని యెట్లు తలఁపలేదో యట్లే వేఱులోకమున నున్నప్పుడు నాకు భర్త లేఁడని నీవు తలఁపరాదు. మీఁదఁజెప్పిన ప్రకరామొక వస్తువే ప్రపంచ వ్యవహారార్థము రెండు రూపములుగ వేఱువేఱు శక్తులతోఁ వెలసెనని యెఱుంగుము. ఇప్పుడు నీ మగఁడు భువర్లోకమందున్నాఁడు. ఈ భువర్లోకము మనలోకమునకుఁ బైలోకమే. నెల్లూరుజిల్లా, కడపజిల్లా యున్నట్టు లనుకొమ్ము. భువర్లోకము రెండు భాగములు. ప్రేతలోక మొకటి. పితృలోక మొకటి. నపిండశ్రాద్ధమున 'ఇతఃపరంప్రేతశబ్దోనాస్తి'యను చెప్పువఱకు మరణించినజీవి ప్రేతలోకంబున నుండును. న్యాయముగ సపిండశ్రాద్ధము సంవత్సారాంతమునఁ జేయవలయు. అంతవఱకుఁ బ్రేతత్వము గలదు. అయినను దేహకాలవైపరీత్యములఁబట్టి సంవత్సరము లోపలఁ గర్త నష్టమైన యెడలఁ బ్రేతత్వ ముక్తిలేకయే పోవునని యిప్పుడు 12-వనాఁడే చేయుచున్నారు. మనకొక మాసమైన ఈప్రేతలోకము వారికి నొక దినమగును. కావున మనము మాసికముగఁ బెట్టునది వారికి దినమున కగుననియే యర్థము. ప్రేతలోకమునుండి పితృలోకమునకుఁ బోయినతరువాత సంవత్సరమున కొకసారి శ్రాద్ధము చేయుదుము. మనకొక సంవత్సరము పితృలోకము వారికొక దినము.

ఇక్కడ మనము పిండముపెట్టినఁ జచ్చినవారు తినవచ్చినారా యని కొందఱు మూఢులు తలఁతురు. ఈ పితృకార్యములకు శ్రాద్ధములని పేరు. శ్రద్ధ ప్రధానముగాఁ జేయఁబడునవి శ్రాద్ధములు. శ్రద్ధయా దేయమ్మని శ్రుతి. శ్రద్ధ యనఁగా దృఢ విశ్వాసము. ఈ కార్యమున కీ ఫలము గలదను నమ్మిక. ఇది మనోవ్యాపారము. నమ్మకము వలననే సర్వకార్యములు నగును. నమ్మకము లేక చేయుకార్యము వ్యర్థము. మనదేహములందుఁ బృథివీతత్త్వము మెండు. దేవతల దేహములందువారివారి తరగతుల ననుసరించి జలతత్త్వము-వాయుతత్త్వము లేజతత్త్వము మెండుగనుండును కావున వారి దేహములవంటివి కావు మన దేహములు. దేవతలు భూమిమీఁద నిలువలేమి కిదే కారణము. అయినను వారికి మనకు సమానముగ నుండునది మనస్సు. మనస్సుచేత మన యభిప్రాయములు వారువారి యభిప్రాయములు మనము తెలిసికొనఁ గలుగుదుము. యోగులు వారితోఁ బ్రత్యక్షసంభాషణములే జరపుదురు కావుననే పూర్వకాలపు స్త్రీలు యోగ మభ్యసించినవారు పగలంతయు నీలోకమునఁ బుత్రరక్షణాది కార్యములు చేయుచు రాత్రులందు యోగబలముచేఁ బతులయొద్దకుఁ బోవుచుండిరి. అట్టి శక్తి నీవు సంపాదించితి వేని నీవు నట్లు చేయవచ్చును.

మనము స్థూల ప్రాకృతిక దేహము కలవారము. మనము స్థూలప్రకృతి పదార్థములనే భుజించి బ్రతుక వలసినవారము. 'యదన్నం పురుషోభవతి తదన్నం తస్యదేవత' యని యుండుటచే మనకేది యాహారమో

యదే దేవతలకు మన మీయవలయును.కావుననే మన మన్నముతోఁ బిండములను జేసి పెట్టుట.దేవతలు దాని సారమును గ్రహింతురు.శ్రాద్ధములు పితృపూజలు ఆరూపమున మన బంధువులఁ దలఁచి పితృదేవతలను మన మారాధించితిమేని వారు తమ లోకముననుండు మన బంధువల కెట్లుపచరింపవలయునో యట్లుపచరింతురు.ఇప్పుడు నే నమేరుకా దేశమున నుండు నా స్నేహితున కొకనికి 100-0-0 రూపాయలు పంపఁదలఁచితి ననుకొమ్ము.నే నేమి చేయుదురు? మన నాణెములను 100-0-0 లు తీసికొని తం తెకొట్టు నధికారులయొద్దకుఁ బోయి నా మిత్రుని పై విలాసముచెప్పి యీ రూపాయలు వారికిఁ బంపుమందును.అతఁడు మనమిచ్చిన రూపాయలనే తంతెకుఁగట్టి పంపునా?లేదుకదా. అతఁడేమిచేయును.అమెరికా దేశములో నీ కార్యమునకై యుండు నధికారులకు నీ విలాసము గలవారికి 100-0-0 చెల్లింపవలసినదని వార్త పంపును.అక్కడివారు మనరూపాయలకు వారి దేశమున నెన్ని నాణెములువచ్చునో యన్ని నాణెములు వానిని వెదకికొనుచుఁ బోయి యిదిగో మీవారు పంపినారని యిత్తురు.ఈ నాణెములక్కడఁ జెల్లవు.తంతెలు లేకయే యిప్పుడు వార్తలు పంపఁబడుచుండలేదా అట్టులే శ్రాద్ధాదు లనుకొమ్ము.కావున మనము మన మనోవ్యాపారములచేతనే మృతులైనవారికి సుఖము దుఃఖము కలిగింపవచ్చును.ఈ కారణముచేతనే మరణించినవారికై యేడువరాదు.

శ్రాద్ధాదులందు మరణించిన వారి బంధువులు మిత్రులు చేరి వారివిషయమై మంచి విషయమునే మాటలాడవలయును.ఆనాఁ డన్న దానము చేయుటయు నీ కారణము చేతనే.వివాహకాలమునఁ జెప్పెడు మంత్రములయందు భార్యాభర్తలయైక్యమును జెప్పెడునవి కలవు.ఆ మంత్రముల యం దీ సంబంధము బ్రహ్మలోకమునకుఁ బోవునఱకుఁ గలదని చెప్పఁబడినది.శ్రుతి స్మృతులయందు నీకుఁ బ్రమాణబుద్ధి గలదేని యిప్పుడు నీచర్య యెట్టిదై యుండవలయునో, యీ లోకమున కాయనను బాపినీవు దుఃఖించిన ట్లా లోకమున నాయనను గష్టపఱిచి నీవును గష్టపడెదవో లేక నీవు బాగుపడి యాయనను బాగు పఱిచెదవో నీవే యాలోచింపుము.గరణ కళేబరము లేదు.పుణ్యము చేయవలయును లేదు.కర్మము లిచ్చటఁ జేయవలయును.అచ్చట వానిఫల మనుభవింపవలయును.ఇచ్చట నీవుమంచికర్మములు పుణ్యకార్యములు చేయుటకుఁ గరణకళేబరముగల దానవు.నీ వేమో తన్నుద్ధరింతువని యాయన యాశపెట్టుకొని యుండును.భూమియం దున్నప్పటి వలె నిప్పుడును నాయనను జెఱుచుట నీ యధీనమందున్నది.

సహగమన మైనఁ జేయరాదుగా యంటివి.ఈ కాలములో నీయట్టివా రావిషయము స్మరింపనైన యోగ్యులుగారు.సాహసించివేసిన నాత్మహత్యాదోషము ప్రాప్తించును.పాతివ్రత్యము నేలోపములేక సాధించిన జ్ఞానవతికి వైధవ్యము రానేరాదు.ఒకవేళ వచ్చెనా సావిత్రివలె యమునితో జగడమాడైనెఁ దన మగని బ్రతికించుకొనును. అంతటి శక్తిచాలని సతి యా వార్తవినిన తోడనే పార్వతివలె యోగాగ్నిని దన దేహమునందే యుత్పత్తిచేసికొని యందే భస్మమైపోవును.లేదా ప్రాణమైనఁ బాయును.అంతటి శక్తి చాలనిది మగనిచితిపైఁ బరుండి దేహమువిడుచును.ఇట్టి యోగ్యత యెట్టి స్త్రీలకుఁ గలదంటివేనిఁ జెప్పదవినుము.ఈ ప్రభుత్వము వచ్చినక్రొత్తలో మనదేశము సహగమనము ప్రబలియుండెను.ఈ సహగమనము భక్తి పూర్వక మైనదిగాదు.కూడు పెట్టవలసివచ్చునను బంధువుల బలాత్కారముచేతను,నత్తల యాఁడుబిడ్డల పోరునకు భయపడియు స్త్రీలు సహగమనము చేయుచుండిరి.కొందఱు స్త్రీలకు గాలుసేతులు గట్టి మండెడు మంటలో బంధువులు వేయుచుండిరి.ఈ హత్యలు నివారించుటకై ప్రభుత్వమువా రొక శాసనము నిర్మింప నాలోచించుచుండిరి.ఈ శాసనమింకను బ్రచారములోనికిఁ గొలఁది దినములలో వచ్చుననఁగా బంగాళాదేశమందొక స్త్రీ సహగమనము చేయఁ బూనుకొనెను.బంధువులు వారించిరి. ఆమె వినినదికాదు.అప్పుడు కొందఱు క్రైస్తవమత బోధకులు లోనగువారు వచ్చి యామె కేమేమో బోధించి "యమ్మా నీవు పతిభక్తి గలదానవే.కాదనము.అయినను నీభక్తి యనునది నీ దేహమును నగ్ని దహించునపుడు నిన్ను రక్షింపఁజాలదు.దేహము కొంచెము కాలఁగానే బాధకుఁ దాళఁజాలక చిచ్చులోనుండి వెలికి దూఁకుదువు.కాలిన దేహముతో బాధపడుదునే గాని దీర్ఘకాలము బ్రతుకవు.ఏల రెంటను జెడెదవు.నీ సాహసము మాను" మని చెప్పిరి.ఆ బాలిక వారిని గని నవ్వి యిట్లనియె."తండ్రులారా ! మీరు భక్తి యెట్టిదో పాతివ్రత్య మహిమ యెట్టిదో తెలియనివారలై యేమేమో పలుకుచున్నారు.మీతోడ నాకు వాదేల? వలసియుండెనేని బరీక్షింపుడు"అని యెడమ మోచేతివఱకు గుడ్డలు చుట్టి చమురులో ముంచి నిప్పు దగిలించెను.చేయి కాలఁజొచ్చెను. వ్రేళ్లు బూడిద యయ్యెను.ఆ యిల్లాలు నొప్పియనినది కాదు.కంట నీరు తేలేదు.ఒకప్రక్క చేయి కాలుచుండినను నెప్పటివలె నలువురతోఁ దన పతినిగుఱించి మాటలాడుచు నాయననే స్మరించుచు నిలఁబడియుండెను.అప్పుడు వారందఱుయ నాశ్చర్యపడి సహగమనమున కనుమతించిరి.ఇట్టి శక్తి భక్తి గలవారు సహగమనముచేయఁ దగినవారుగాని తక్కినవారు గారు.

ఈ కాలమునఁ బతి మరణించిన స్త్రీలచర్యలు నాలుగు విధములై కానవచ్చుచున్నవి.

1. బసివిగ్గియే పోవుట ఇది నేను జెప్పనురాదు.నీవు విననురాదు.

2. దీని యట్టిదే రెండవది. పునర్వివాహమనుపేరి బహిరంగ వ్యభిచారము. సతీధర్మము శీలమహిమ తెలిసిన గండకివంటి వేశ్యయును దీని నంగీకరింపదు. కామాసక్తులు దీని నాదరింతురు. ఇట్టివారు కొంపలలో నుండి వ్యభిచరించి కులమునకు వంశమునకు నపకీర్తి తెచ్చుటకంటెఁగొంపవిడిచిపోవుట మేలని తలఁపవలసి యున్నది. ఇట్టివారికి మొదటి మగఁడుపోవుట పిక్క వెంట్రుక రాలిపోయినట్టు, తరువాతి మగలు పోవుట యెట్టిదో. ఈ కాముకలు కండూతి నివారణము మహాకర్తవ్యముగాఁ దలంతురేకాని మగనికిఁ దనకుఁగల సంబంధమెట్టిది? తనకేల వైధవ్యమువచ్చెను? తాను మాఱు మగనికి దగులు కొనిన మొదటి మగనికి బిండోదకములు లేవాయెఁ గదా? దానివలన నెట్టి ఫలముగలదు? కామమునకు దాసియగుట మేలా ? కామమును జయింప యత్నించుట మేలా? తల్లిదండ్రు లొకనికి దానముఁ జేసినసొత్తును మఱియొకని స్వాధీనపఱుచుట దత్తాపహారము కాదా? సాధ్వియై సాత్త్వికపద్ధతి సత్సంతానముగాంచి పితౄణము దీర్చుటగదా యార్యవివాహధర్మము అటుండ రెండవ మూఁడవ నాలుగవ మగలను వరుసగఁ దగులుకొని సంతానముఁ గాంచునది సాధ్వియగునా? అది సత్సంతానమ గునా? లంజకొడు కబ్బకుఁ బెట్టుతద్దినము లెవ్వని కెక్కు? ఆర్యవివాహములు సమంత్రకములు గదా? ద్వితీయాది వివాహములకు మంత్రము లెందుఁ గలవు? ఆ మంత్రకమైనది యార్యవివాహ మగునా ? కాకున్న దాని పేరేమి. విధవ శూర్పణఖ రహస్యముగ వ్యభిచరింప యత్నించెను గాని వివాహమాడ యత్నింపలేదు. కుంభీనస వైధవ్యమునకు భయపడెను. గాని వీఁడు పోయిన మఱియొకఁడు వచ్చును లే యనలేదు. రాక్షసస్త్రీల యభిప్రాయమే యిట్టిదైయుండ నిఁక నార్యస్త్రీల గుఱించి యేమి చెప్పవలయును. ఒకనికి వ్యాధివచ్చి నపుడు దాని కారణము తెలిసికొని తగిన యౌషధము తీసికొని పథ్యముండి యట్టి కారణములు మరలఁ గలుగకుండ వర్తించుట బాగా? ఏ కారణములచే రోగము వచ్చెనో యా కారణములనే సేవించుచుండుట బాగా? దుష్కామసేవచేఁ గలిగినబాధ దుష్కామసేవచేఁ దొలఁగునా ? కామము నణఁచుటచేఁ దొలఁగునా? అది మంచికార్యమైనచో శాస్త్రమేల యంగీకరింపదు? లోకమేల రోయును? దీనిని విశేషము చర్చింప మనసులేదు. కావున నిది శ్రేయస్కా ములగు వారు చేయరాని కార్యమని మాత్రము చెప్పి విడిచెదను.

ఇఁక మూఁడవమార్గము. మగఁడు చచ్చిన నెలలోపలనే పాఠశాలయందుఁ జేరుట. ఉద్దేశము పరీక్షలయ ందుఁ గడదేఱి యుద్యోగములు సంపాదించి పొట్టపోసికొనుట. ఇది పరదేశాచారములను బట్టి కాలానుగుణ్యముగ వచ్చిన యాపద్ధర్మము. ఇది మొదటి రెంటివలె హేయమని చెప్పఁజాలనుగాని యార్యమతనిష్ఠలగు శీలవతులుఁ బతివ్రత లిది యోగ్యముగఁ దలఁచుటలేదని చెప్పవలసియున్నది. ఏలన :- తనకీ వైధవ్యము ప్రాప్తించుటకుఁ దానే కారణమనియుఁ దనినిమిత్తముగఁ దన్ను విశ్వసించి తన్నే ప్రాణముగ నెంచుకొని తనదేహము పుణ్యము సగము పంచియిచ్చిన వాని ప్రాణము సౌఖ్యము దన చేతిలోనుంచి పరలోకసాధనమునకుఁ దన్నే యాధారముగ నెంచుకొనియుండిన యొక జీవిని నర్ధాయుష్కునిఁగనో యల్పాయుష్కునిగనో చేసితినిగదా. ఇట్టి కృతఘ్నురాలనగు నే నెట్లు తరింతును ? ఆయన నెట్లు తరింపఁజేయుదునను నాలోచనమునకే యీ మార్గమం దెడములేదు. స్త్రీ పురుషుల దేహములను గుణములను జూచిన వీరు వేఱు వేఱు కార్యములకై భగవంతుఁ డుద్దేశించి సృష్టించినట్టు తోఁపకమానదు. జ్ఞాన మిరువురకు సమానము. అట్టి జ్ఞానము నాధారముగఁ గొని యిరువురు వారివారి కృత్యములు వారువారు నెఱవేర్పవలయును. అంతియకాని పురుషాయితచర్య యే కార్యమందును స్త్రీకిఁ దగినదికాదు. అట్టి తగనికార్యమందువర్తించుటకుఁ గామోద్రేకమే కారణమైయుండవలయును. అది ధనకామమైనఁ గానవచ్చును. మఱి యేదైనఁగావచ్చును. ప్రశంసయం దుండునది ధనకామమే. ఇప్పటి పాఠశాలలయందు నేర్పునది విద్య కాదని యార్యవిద్యోపన్యాసమందు విశదీకరించియున్నాను. బాలు రిహమందుఁగాని పరమందుఁగాని బాగుపడుటకుఁ కావలసినవి వారికి నేర్పుటలేదు. స్త్రీలకుఁ గావలసినవి స్త్రీలకు నేర్పుటలేదు. కూలివాండ్రై పొట్టపోసికొనుటకుఁ గావలసిన దేదియో యది యామాత్రమే నేర్పఁబడుచున్నది. ఈ పాఠశాలలవలన బరకీయ విద్యవలన స్త్రీలు పురుషులవలె వర్తింపనేర్చి తమ వేషములు కార్యములు పురుషుల కప్పగించుచున్నారు. ఆఁడువారు చొక్కాలు దొడుగుచున్నారు. పురుషులు రవికలు దొడుగుచున్నారు. ఈ వివరము లేలగాని యీనెల (ఆగస్టు) మాడరన్ రివ్యూలో నమెరికా దేశమందుఁ బురుషులకు జంపుటకై తుపాకులు గుఱికాల్ప నేర్చుకొను స్త్రీల వరుసలు ముద్రింపఁబడినవి. టీ కాఫీలవలె నిదియును ద్వరలోనే మనదేశమునకు వచ్చును. అప్పు డాఁడుమళయాళమని ప్రమీలాలు వెల్లివిరియుదురు. స్త్రీ పురుషులు వేషభాషాకార్యములు పరస్పరము మార్చుకొనుచున్నట్టు వినుచున్నా ముగాని గర్భముధరించి బిడ్డలఁగని పాలిచ్చి పోషించు పురుషులను, గ్రాపింగుచేసికొని మీసాలు గడ్డములు పెంచి మగవారికి గర్భాదానముఁ జేయు స్త్రీలను మాత్ర మింకను వినలేదు. ఆ పుణ్యకాల మెప్పుడువచ్చునో. కావు న మన నీతిమతాచారములు కులధర్మములు విహితకృత్యములు నేర్పని పాఠశాలలు సర్వదా సర్వథా త్యాజ్యములు కూలిబ్రతుకుకోరికతో విహితకృత్యముమానియాశ్రమధర్మ విరుద్ధములన వేషములు వేసికొని యూరు మెఱవడి పోవలయునా ? విద్యనేర్వ నాశయుండిన నింటియందే నేర్వరాదా? విద్యనేర్వనాశయుండిన వీథి పల్లెకూటముల

వలెఁదన యింటియందే తగిన పిల్లలఁ జేర్చుకొని నేర్పరాదా ? ధన మార్జింపఁ గోరికయుండినఁ దన యింటి యుందుండియే చేయు పనులు చేయరాదా? ఈవిధముగ జీవించు స్త్రీ లెందఱులేరు.స్త్రీలు విద్యనేర్చుటకుఁ బోవలసియుండన వృద్ధయుఁ గులస్త్రీయు జ్ఞానవతియు నగు నామెయొద్దకుఁ బోయి నేర్వవచ్చును.పురుషుల యొద్ద నేర్వవలసియుండెనా.

శ్లో. యస్య నజ్ఞాయతేశీలం,కులం యస్యచసంశ్రయమ్
న తస్యసంగతిం కుర్యా దిత్యువాచ బృహస్పతిః.

యన్నట్టు లెవని నడవడి కులము వృత్తి మొదలైనవి ముందుగా మనకుఁ దెలియవో యట్టివాని సాంగత్యము చేయనేరాదు.దీనిని బాటింపని కారణముచే స్త్రీలు పురుషు లనేకులు భ్రష్టులయినారు.పురుషులు వేనవేలు వెచ్చించి పట్టభద్రులై కూలి చేసి బ్రతుకుచుండుట చాలదా,స్త్రీలు కూడఁ గూలిచేసియే బ్రతుకవలయునా?విధవ ల కేమి కావలయును? పట్టెఁడుకూడు రెండో మూఁడో చీరలుగదా.పిడికెఁడు మెతుకులకై పరులకు సేవచేసి బ్రతుకుటకంటె నత్త మామలకో తల్లి దండ్రులకో యన్న దమ్ములకో సేవచేసి బ్రతుకరాదా? దానికంటె నిది పాపకార్యమా ? ఆపదేవేళల జంద్రమతి-ద్రౌపది-దమయంతి సేవచేయలేదా?మంచిగుణము-మెత్తనినోరు-విధే యత-ప్రీతి యవి యుండెనేని యెందైనఁ బూజ్యతగలదు.ఇవి లేవేని కొలువులందు మాత్రము పూజ్యతగలదా?అ యిన వారి యొద్ద నుండుట కష్టమేని పరకీయసేవ-ధనార్జనము సుకరములా?నోరు మంచిదైన నూరుమంచిద నుట యెఱుఁగవా?ఇంతకు సన్యాసులకు విధవలకు ధనమేల? ధనము కామహేతువు మదకారణము దుఃఖమిశ్ర మైన యల్పసుఖము నిచ్చును.భగవత్సేవయో,కామసేతువు మదవారణము,శాశ్వత సౌఖ్యైక దాయకము.సుకరము సత్యఫలము.ఇట్టిదానిని వదలి యట్టి దాని కేకారు వారు బుద్ధిమంతులా?అందు భగవంతుఁ దనుకూల సందర్భ ములు గలిగించినపుడు వానిని ద్రోచివైచి మరలఁ బుఱ్ఱుగుంతలోఁ బడఁ జూచువారు తెలివి గలవారా? కావున నిదియును బ్రశస్త మార్గముగాదు.

అట్లైన నిఁక నేది ప్రశస్తమార్గమందునా? ఒక విధవకు నమస్కారము చేసిన నావలెనే యుండుమని దీవించెనఁట.అట్టులే నన్ను నీవు మార్గమడిగిన నా మార్గమే ప్రశస్తమందును.సంఘ సంస్కార నామధారుల నడిగితివా మరల వివాహము చేసికొమ్మని చెప్పుదురు.కులట నడిగితివా ఛీ మరల మగఁడేమిటే.పోయినవాఁడు పోనే పోయినాఁడు.మరల నొకనికి లొంగి వంగి పాదాక్రాంతవై వాని యిష్టమువచ్చినట్టు నడచుచు వానికి భయపడుచు మన స్వాతంత్ర్యము విడిచి పశువువలె వర్తింపవలయునా? ఇపుడు చూడు నా కనుసన్నల నెందఱు మగవారు నా యనుగ్రహమునకుఁ గాచి తిరుగుచున్నారో యనును.ఉపాధ్యాయ నడిగితివేని ఛీఛీ యవి సరిగావు.బ్రతికినన్ని దినాలు సగౌరవముగ బ్రతుకవలె.ఇప్పుడు చూడు నెలకాఁగానే గల్‌గల్ అని రూపా యలు నా చేతిలోఁ బడుచున్నవి.ఇష్టము వచ్చినట్టు తినుచున్నాను కట్టుచున్నాను.నలుగురిలోఁ దిరుగుచున్నా నని చెప్పును.అట్టులే నేనును.నామార్గముననే కొండాడుచు ఈ మూఁడుమార్గములు నీవు భ్రష్టవగుటకు హేతు వులు.వీనియందు సుఖములేదు.వారు దుఃఖమును సుఖమని భ్రమించుచున్నారు.వారి మార్గములు దుఃఖమునుండి నిన్నుఁ దరిపంఁజేయలేవు.భూమిమీఁద మనుష్య జన్మమెత్తినది యీ తుచ్ఛసుఖము లనుభవించుటకా? భగవంతుఁ డు మనకు జ్ఞానమిచ్చినది యేల? పశువులవలెఁ బొట్టకుఁ దినుటకా ?అటయినఁ బశువులకు మనకు నేమి భేదము.మనకిచ్చిన జ్ఞానమును మన ముపయోగింపమేని వీరికి జ్ఞానమిచ్చి ప్రయోజనపడేలేదు; ఇఁకను గొంతకాలము వీరు పశువులుగానే యుండనిమ్మని భగవంతుఁడు మనల మరలఁ బశువులుగా సృష్టించును.కావు నఁ బశువులకు మనుష్యులకు సమానములయిన నాహార నిద్రాభయ మైథునములందలి యాసక్తిమాని కేవల మనుష్యధర్మమయిన జ్ఞానముచే యాశ్రయింపుమందును.జ్ఞాన మార్జించి దాని నాచరణమునకుఁ దెచ్చిననే మనుష్య జన్మము సార్థకము.ఎంతోకష్టపడి టెంకాయచెట్టెక్కి యిఁకఁగాయ చేతికందు దూరములో నున్నదనఁగాఁ గ్రింది ముష్టిపండును జూచి దానికై నేలదూఁకి కాలు సేతులు.నడుమువిఱుచుకొనువాఁడు బుద్ధిమంతుఁడా.అటు గాక టెంకాయ కోసి తెచ్చి యూరక దానినొకచో నుంచువాఁడు నేర్పరియా?అట్టులే జంతుకోటిలోమానవ జన్మమే దుర్లభము.అందుత్తమ జన్మము మిక్కిలి దుర్ఘటము.అందు సద్వంశసంభవము మఱింత దుర్ఘటము.అట్లు పుట్టి మోక్షము బారెఁడు దూరమందున్నదనఁగా మరల సంసార కూపంబునఁ గూలువారు బుద్ధిమంతులనిపించు కొందురా ? కావున జ్ఞానమార్జించుట దాని నాచరణమునకుఁ దెచ్చుట మనుష్యుల కందఱకు విధి.అందుత్తమ జాతుల కది యనివార్యమైనది.

శ్రీ శంకరాచార్యులవారు వివేకచూడామణియందు,

శ్లో. దుర్లభం త్రయమేవైత ద్దేవానుగ్రహ హేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః.

లోకమున మూఁడు దుర్లభములు.అవి దైవానుగ్రహము లేక లభింపవు.అవి యేవన 1. మనుష్యజన్మము,

2. మోక్షమునందుఁ గోరిక, 3. జ్ఞానియగు గొప్పవాని యాశ్రయము,వీనిని జెప్పెనుగాని ధనమార్జింపుమని కామ సుఖము లనుభవింపుమని యాయన చెప్పలేదు. ఆయనమాత్రమేల? ఏ దేశమం దేజాతియం దేమతమందైనను జ్ఞానులు,శిష్టులునగు వారెవ్వరును ధన కామములను నీచములని చెప్పిరి గాని ప్రశస్తములని చెప్పలేదు. మన జన్మములకుఁ గామమే కారణము. కామముచేఁ గార్యములుచేసి వానిఫల మనుభవించుటకై జన్మము లెన్నియైన నెత్తుచుందుము.

కామము రూపుమాయువఱకు మనకు జన్మములు తప్పవు. నీవు పదిలక్షల రూపాయలు సంపాదించినను నీపాపము వలన నర్ధాయువువై చచ్చి తరుణోపాయము స్వయముగఁ జేసికొనఁజాలక తపింప నీ మగనికిఁ బుణ్యలోకము లిప్పింపఁగలవా? అతని నట్టి గతిని ద్రోచుటచేఁ గలిగిన నీ పాపమునుండి నీవు ముక్తురాలవు కాఁగలవా? ధన మెక్కువ చేరుకొలఁది కష్టములు మెండు. తిండికిఁ బదుగురు చేరుదురు. నిన్నెదురుగ భూషించుచుఁ జాటున దూషించు బంధువులు తిండిపోతులు వలసినంతమంది యింటినిండఁ జేరుదురు. పెట్టితివా పెండ్లి. పెట్టకుండిన శ్రాద్ధము. ఇది బంధువుల లక్షణము. ఇంత సంపాదించి యొక కాసైనఁ గూడఁ దీసికొని పోవుదువా ? కావున సుఖాభిలాషచే నశ్వరము దంధనమైన ధనమునకై యేకారువారికంటె మూఢులు మఱియొకరు లేరు. కావున నట్టిమార్గము నీవు మనస్సునందైనఁ దలఁపవలదనియే చెప్పుదును.

ధనము హెచ్చెనా మదము హెచ్చును మదము హెచ్చనా దుర్గుణము వెంటనే హెచ్చును. అందు జ్ఞానశూన్యులయందిది యనివార్యము. ఇఁక నాఁడుదాని చేతి యర్థమును గుఱించి చెప్పవలయునా? వయస్సుండి ధనముండి యవివేకమునుండిన యాఁడుదానికిని సారాయిత్రాగి దయ్యముపట్టి తేలుకుట్టిన క్రోఁతికి నేమి భేదము. కావున సర్వవిధముల బాగుపడఁ గోరువారు ధనకాంక్ష మానవలయును. సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్యమూహింపఁగన్ అనుటమఱవకుము.

అట్లైన నుదయమున లేచి రాత్రి నిద్రపోవువఱకు నేను జేయవలసిన కార్య మేమో చెప్పుమనెదవా. ఇంకొక విషయము చెప్పి యవల నది చెప్పెదను. నేనెంతో కష్టపడి యాయనకు సేవచేసితిని. వ్యర్థమైపోయెను. అని నన్నుఁ జూచినపుడు విలపించితివిగదా. నీవు చెప్పినది సత్యమేకాని యొకరు తనకుఁ గర్తవ్యమైనదానిని జేయుట గొప్పతనమాయని నాసందేహము,దగ్గఱబంధువులైనను దూరమువారైనను నన్యులైనను గష్టకాలమం దొకజీవికి సహాయపడుట మనుష్య ధర్మము,పశువులు,పక్షులుకూడనట్లు సహాయపడెనని మనము వినుచున్నాము. అట్లుండ భార్య భర్తకును,భర్త భార్యకును సాహాయ్యపడుట యేమి గొప్ప. నేనే కష్టపడి సంపాదించి నా పెండ్లమునకుఁ గూడు గుడ్డపెట్టి భరించుచున్నానని యొకఁడనెనేని వానినిజూచి లోకు లేమందురు? అట్లైన నా కథ కొంచెము చెప్పెదను విను. నా భార్య చనిపోవుటకు ముందు మూఁడు సంవత్సరములు క్షయవ్యాధిచే మంచమెక్కి బాధపడెను. ఇంట మేమిరువురమేకాని మూఁడవవారు లేరు. తొమ్మిది తొమ్మిదిన్నర గంటలోపల వంటచేసి నేనుదిని దానికిఁ బథ్యము పెట్టి రాజకీయకలా పాఠశాలకుఁబోయి మరల మధ్యాహ్నము వచ్చి దానికిఁ గావలసిన మందు పథ్యమునిచ్చి పాఠశాలకుఁ బోయి మరల నాలుగుగంటలకు వచ్చుచుంటిని. తక్కినవన్ని యేలకాని యది లేవలేక నడవలేక యడిగిన కారణముచే దానికిఁ జీర నేను గట్టుచుంటిని,మలమూత్రములు నేనెత్తి పోసి ప్రక్షాళనము చేయుచుంటిని. ఇవి కష్టకార్యములుగ నే నెంచలేదు. అది యొక పెంకె. పూఁట పూఁటకు నాకీకంటి నీ రాకంట పోసిగాని మందు త్రావునదిగాదు. బలవంతముగా మందిచ్చెదనన్న కోపముతో నొక్కొక్కనాఁడు తిండికూడ మానుచుండెను. ఇట్టి రోగితో నెట్లు వేఁగవలయును. ఇంతయేల యది చచ్చుటకు మూఁడుదినములు ముందు దానికి నాకు మాటలులేవు. కనుచూపులు లేవు. చచ్చెడిదినము నుదయమున దానియక్కగారు వచ్చి పిలిచిఁ బోయితిని. ఇఁక రెండుమూడుఁ నెలలకుఁ బోవుననఁగా వచ్చిన దానితల్లి యక్కయే రోసి యిట్టి మూర్ఖురాలితో నెట్లు వేఁగినాఁ డీ బ్రాహ్మణుఁడని యనుచుండఁగా వింటిని. ఇది తెలిసినవారిప్పటికి నున్నారు. దీనికేమనెదవు? వాస్తవమారయ నొకజీవి మరణించుటచేఁ దనకుఁగలిగిన ధననష్టి,సుఖనష్టి. సంతోషనష్టి రాఁగల కష్టముల నాలోచించి మఱియొకజీవి శోకించునే కాని మరణించినవారికై యేడ్చువారు లేరు.

శ్రీరామ

## రెండవ భాగము

=========

పతివియుక్తలైన స్త్రీ లీకాలమున వర్తించు మూఁడు మార్గముల నిరసించితిని. ఈ లోకమున నవి లాభకరములు సంతోషకరములైన నగుఁగాక కాకుండినఁ గాకపోవునుగాక. పరలోకమున నవి బాధాకరములు గాక మానవు. ఈ లోకమునఁ బూర్ణాయువుగలిగి బ్రతికినవారు మరల భూమిపై జన్మించుటకు 1500 ల సంవత్సరములు పట్టునందురు. ఒక జీవి మరణించుటకు మరలభూమిపై జన్మించుటకు నడిమికాలము 1500

సంవత్సరములు ఇక్కడఁ జేసిన పుణ్యాపాపముల ఫలమచ్చటఁ గొంత యనుభవించి కరణకళేబరముతో ననుభవింపవలసిన శేష మనుభవింప భూమిపై మరల జీవి జన్మించును. అత్యంత తీవ్రవిషయ వాసనాబద్ధు లత్యల్పకాలమునఁ బుట్టుటయుఁ గలదు. పుణ్యాత్ములకు యోగులకు నంత కెక్కువ కాలము పట్టును ఏవిధముగఁ జూచినను నీ లోకముననుండు కాలమునకంటె నెక్కువకాలమే పరలోకమం దుండవలయును. అట్లయినప్పు డా లోకమున మనకేది శ్రేయస్కరమో మఱి జన్మమున మనకేది సుఖకరమో యట్టిదానిని జేయువారు బుద్ధిమంతులా కొంపకుఁ జిచ్చు పెట్టి పేలాలు తినువారు బుద్ధిమంతులా ? రాత్రికిఁ గావలసిన వస్తువులు పగటనే సేకరింప వలయును. వానకాలమునకుఁ గావలసిన యెండకాలము నందే సేకరింపవలయును. వార్ధకమునకుఁ గావలసిన వయస్సు నందే సంపాదింపవలయును. పరలోకమునకుఁ గావలసినవి యిహలోకమందే చేయవలయును. ఇది శ్రేయస్కరమైన నీతి మార్గము. కావున నీ యట్టిదశయం దుండువారికి నేది శ్రేయస్కరమని సనాతన ధర్మశాస్త్రములు బోధించుచున్నవో యేమార్గమందు శీలవతులైన సతులు శిష్టాచారమని యాదరించి నడచుచున్నారో యట్టిదానిని చెప్పెదను. వయస్సుచిన్న – మార్గము క్రొత్తయగుటచేఁ బ్రారంభదశయందు నీకుఁ గష్టముగఁ దోఁచినఁ దోఁపవచ్చును. అభ్యాసము కూసువిద్య. కొంత యభ్యాసపడెనేని యావల నే కష్టము దోఁపదు. కష్టీ ఫలీ; కష్టపడక యేదియు సిద్ధింపదు. పిల్లవాండ్రు నడుచుటకుముం దెంత శ్రమించెదరో యెఱుఁగువా? బిడ్డలకై స్త్రీ లెంతకష్టపడెదరో యెఱుఁగవా? అట్టులే యన్నియును. ఒక బలిష్ఠవ్యాధిచే బాధపడువానికి వైద్యుఁడు లంకణములు వేసెనేని యాప్రకారము లంకణముండునట్లు చేయువారు వానిమేలు కోరువారా! అపథ్యభోజనము పెట్టువారు మేలుకోరువారా !మేలుకోరువాఁడు కొంచెము కఠినముగానే చెప్పును. చెఱుపఁగోరువాఁడు నవ్వుచుఁ జెప్పును. ప్రియములు పలుకువారు పెక్కురు సులభులు. హితము చెప్పువాఁడు దుర్లభుఁడు. వినెడు వాఁ డంతకంటె దుర్లభుఁడు.

పతి మరణించిన కామమ్మయను నొక యువతి యిట్టు లాలోచింపసాగాను. అయ్యో నేనెంత నిర్భాగ్యురాలను. నాది యెట్టి దురదృష్టదశ వెనుకలేరు ముందులేరు. తల్లివంకవారో తండ్రివంకవారో మగనివంకవారో యెవరైన స్త్రీకి నొకరుందురుగాని నా గ్రహచారబల మెట్టిదో నా కెవ్వరునులేరు. నీ వా రమ్మనువారు లేరు. పిలిచి యాదిరించువారు లేరు. అయ్యో పాపమనువారును లేరు. ఇట్టిదికూడ నొకజీవి లోకంబున నుండెనా? ఉండునా యని సందేహింపనేల? భూమిమోసినంత యున్నదాననుగా. తినను గూడు లేదాయే. కట్టను బట్ట లేదాయె. నిలువ నీడలేదాయె. క్రొత్తవిధవనే యని దయతలఁచి నీ రీ సత్రమునఁ గొన్నాళ్ళుండుమనిరి. పదునొకొండవ నెలయందుఁ బుట్టినింటికిఁబోయి వచ్చినఁగాని మఱియెచ్చోటికిఁబోరాదఁట. తమ కేమికీడు మూఁడునోయని నన్నెవరు తమ యిండ్లు లోపలికే రానీయరు. పదునొకొండవనెలయే వచ్చెననుకో. కూఁతురా రావమ్మాయని నన్నుఁ బిలుచుకొని పోయినా మొగాన నెట్టుగుడ్డ వేయువారెవరు? హరిహరీ యేమికష్టమేమికష్టము. ఇంతకష్టమేలవచ్చెను? కట్టుకొన్న మగఁడు లేని కారణముచేత. ఆయన యొకఁ డున్నప్పు డేమితెచ్చునో యెట్లుతెచ్చునో యెట్లోభరించుచుండిన నదిలేదు. ఇదిలేదని నసగొట్టి ముక్కువిఱిచి మూఁతివిఱిచి సొణుగుచుండిన దానను. ఆనిమిత్తముననే కాఁబోలు భగవంతుఁడా నా గర్వ మఱఁపనిట్టి కష్టదశఁ గల్పించెను. భగవంతుఁడా కల్పించెను? ఎంతమాట. భగవంతునకు నాయందుఁ గోపమా? లేదులేదు. నా పూర్వకృతకర్మమే నా కీ దశ కల్పించెను. మునుపు చేసినదే యిప్పు డనుభవించుచున్న దానను. వండుకొన్నమ్మ బోసేయక తీరునా? మునుపు నేనేమిచేసితినో యెట్లు తెలియవలయును? ఇప్పటి ఫలానుభవమునుబట్టి కారణములేక కార్యము కలుగదు. నిప్పుత్రొక్కక బొబ్బపోదు. విషమునుమ్రింగి యది ప్రేగులు తెగఁగోయినప్పుడు విలపించినఁ బ్రయోజనమేమి? ఈ కార్యము చేసిన మేలుగలదు. ఈ కార్యము చేసినఁ గీడు గలదు. అని కార్యము చేయుటకుముందే యాలోచించి మంచికార్యము చేయుచుఁ జెడుకార్యము మానుచు వర్తించువారు సర్వదా సుఖమునే యనుభవింతురు. కార్యమునుబట్టి కారణ మెఱుంగ వచ్చును. ఇప్పుడు నేను దరిద్రురాల నేలయైతిని? పోయినజన్మమున దానధర్మములు చేయని కారణమున. నా కెవ్వరు ప్రాపేల లేకపోయిరి ? నే నొకరికిఁ బ్రయోజనపడని కారణముగ. మగఁడేల పోయెను? పోయిన జన్మమునఁ దిండికిఁ దండిగఁ గలదని కండలు మెండుగఁ బెంచి కామమదమునఁ గన్ను గానక మిన్ను మన్ను తెలియక వర్తించి తన దేహమును దనపుణ్యమును సగము నాకుఁ బంచియిచ్చి నాపాపమును సగముఁ దానుబంచుకొని నా సుఖమే తనసుఖముగను, నాసంతోషమే తన సంతోషముగను దలంచుచు నన్నెంతో ప్రీతితో నాదరించుచుండిన భర్తనే వంచించి నిమిషసుఖాభాసమునకై తండ్రిచే దత్తమై మగనిసొత్తైన యీ దేహమును బరుల పాలుచేసితిని. మఱి యెన్నెన్ని విధములనో యాయన మనసునొప్పించి కృతఘ్నునై విశ్వాసఘాతక నైతని. ఇట్టి నీకు మగఁడేటికని కాఁబోలు దేవుఁడు మగని నెడఁబాపెను. కామరోగమునకు నౌషధముగఁ గాఁబోలు వైధవ్యమును విధించెను ఇట్టి నాకష్టదశకు నేనే కారణభూతురాలనుగాని దేవుఁడుగాఁడు. గ్రహములుకావు. నామగఁడును గాఁడు. తినెడివారి నిర్భాగ్యదశ కొంచలది సంపాదించువాఁడుపోవును. అట్టులే నేనీ కష్టదశయనుభవింపవలసి యుండుటచే నాయన

యల్పాయుష్మంతుఁడయ్యెను. ఆయన పోవుటమాత్రమేకాదు. ఆయన కట్టిన త్రాడాయనతోడఁ బోవుటయేకాదు. క్రొత్తనీళ్ళు వచ్చి ప్రాఁతనీళ్లు పోయినట్టు కన్యాదశయం దుండిన పసుపు కుంకుముకూడఁబోయెను. కడుపునిండఁ గమ్మని భోజనము పోయెను. కట్టను మంచి చీరయుఁ బోయెను. ఇది యదియననేల? సర్వముపోయెను. గతించిన దానికి శోకించి ప్రయోజనములేదు. ఇఁకజరగవలసిన దెట్లు ? నేనేమి చేయుదును? దిక్కుమాలిన యీకష్టపు బ్రతుకు బ్రతుకుటకంటె నీటనో త్రాటనో చత్తునా? హరిహరీ ! ఆమాట ననుకోరాదు. భగవంతుఁడు నిష్ప్రయోజన ముగనా నా కాయుస్సు పెట్టినాఁడు? నేను భూమిమీఁదఁ బుట్టినకార్యము ముగిసెనా యావల నొక క్షణమైన నిం దుండనీఁడు. నేను బ్రతికి యేమేమి కార్యములు చేయవలయునని యేమేమి కష్టసుఖము లనుభవింపవలయు నని భవత్సంకల్పమో. ప్రారబ్ధమంతయు ననుభవింపవలదా? ప్రారబ్ధ మనుభవింపక నశింపదుగదా. బలాత్కార ముగ నే నిప్పుడు మరణించినను జన్మాంతరమందైన నీ ప్రారబ్ధశేష మనుభవింపవలయునుగదా. ఆమాత్రమైన మేలే. బలవన్మృతికి శిక్షగ దీర్ఘకాలమాసురలోకమున మహాయాతన లనుభవింపవలయునుగదా. అంతియకాదు. ఈ యాయువు తీఱువఱకు పిశిచినై యుభయలోక భ్రష్టనై యల్లాడుచుఁ బేఁడ చుట్టలనీళ్లు గుడ్డపిండిననీళ్ళుత్రాగుచు నల్లాడవలయునుగదా. కావున బలన్మరణ మనుకొరానిపని. మఱియును గష్టానుభవమువలనఁ బాపము నశించును సుఖానుభవమువలనఁ బుణ్యము క్షయించును. కావునఁ గష్టమనుభవించి పాపము నాశముచేయక దాని నింకను దాఁచిపెట్టియుంచవలయునా.

అటుకాదేని కాననిదేశమునకుఁ బోయి గుడిసె వేసికొందునా? అటుగాకున్న నీకాలములోఁ గులకన్యలు దొరకక యితరవిధముల వివాహమునకు యోగ్యత లేక భోగముసానుల కిచ్చుటకు డబ్బులేక రోగములు వచ్చునోయను భయముచేతఁ బెండ్లియో పెండ్లియో యని యేడ్చు మగవిధవ లెందఱోయున్నారు. అట్టివారిలో నొకనిఁ దగులుకొని పునర్వివాహ శ్రాద్ధము జరగింతునా? ఆఁడుది కావలయుననిన మగలకాకఱవు? కనుగీఁటి తినా కుక్కలవలె నా గోఁచివెంట నూర్వురు పరువెత్తురా? ఇవియును గారానిపనులే. ఏల? కామముచేతనే కదా నే నీ మాలకుళ్లు కుడువవలయును. సర్వానర్థకము కామము. కామమే సర్వపాపములకుఁదల్లి. కామము బిడ్డ లేక దా క్రోధలోభ మోహమదమాత్సర్యములు. హింసాస్తేయాసత్య దుష్పరిగ్రహములు కామసంతానములేకదా. అధర్మమునకు మూలకందము. కామమేకదా. నరకమును బోషించునది కామమేకదా. కామము భీత్యభిమానలజ్జల నెఱుంగదుకదా. కామదాసులు కామదాసికలు సుఖపడినవా రొక్కరైనఁ గలరా ? రాముఁడు కాముఁడు నొక్కచోట నుండరన నేమి యర్థము. కాముకుఁడు తండ్రితోనైన ద్వేషించుననియేకదా. కాముకునకు దైవము లేదనియేకదా. గురుఁడును లేఁడనియే కదా? ఇంతకుఁ బోయినజన్మమునఁ గామదాసినైకదా యిట్టి కష్టదశకుఁ బాల్పడితిని. కావుననే కాఁబోలు నా తల్లిదండ్రులు నాకుఁ గామమ్మయని పేరిడిరి. మరల నదే దోషముచేసిన నాగతియేమి? కావునఁ గామము కారణముగాఁగల యే కార్యము చేయరాదు. నాపేరు వ్యర్థము చేయవలయును. అట్లైన నిప్పటినా యాశ్రమమేది? ఏ యాశ్రమ పద్ధతుల ప్రకారము నడుచుకొనవలయును.

కన్యనాగాను, గృహిణినిగాను, గృహస్థాశ్రమమునకావల వానప్రస్థమే. వానప్రస్థనగుదునా? ఎట్లగుదును? కేవల స్త్రీలకు వానప్రస్థమం దధికారముగలదా. ఈ కాలమున వానప్రస్థసన్యాసములు రెండును మగవారికే నిషిద్ధములఁట. ఇఁకా నామాటయేల. ఇక మిగిలినది సన్యాసమే. అదియే నాకుఁ దగినది. పెద్దలుకూడ వైధవ్యము సన్యాసము సమానమందురు. ఏల? ఇరువురకుఁ గామము నిషిద్ధము. భోగము నిషిద్ధము. త్యాగ మిరువురకుఁ గ్రాహ్యము. భగవచ్చింతన మిరువురకుఁ గర్తవ్యము. ఒంటిపూఁట భోజనముకాషాయవస్త్రధారణములోకహితవాంఛ బ్రహ్మచర్యవ్రత మివి యిరువురకు సమానములే. వైరాగ్య మిరువుర కవశ్య గ్రాహ్యము. కావున నేనును సన్యాసిని నయ్యెదను. నా కాశ్రమ స్వీకారమెట్లగు ? ఎవరిత్తురు ? ఆశ్రమ స్వీకారముతో నాకుఁ బనిలేదు. నలింగం ధర్మ కారణమని కలదుకదా. చిహ్నములతోడ నాకేమిపని. ఈ కాలమందలి సన్యాసచిహ్నధారులను జూచుచున్నాము గదా. వారివలె నేను జెడవలయునా ? కావున నిషిద్ధసన్యాస లక్షణస్వీకారము నా కేల ? కామ్యకర్మముల ఫలా సక్తి వదలుటే నిజమైన సన్యాసము. పుణ్యకర్మములు చేయుచు వానివలన ఫలముఁ గోరుకుండుటే నిజమైన సన్యాసము. నేను నిఁకమీఁద నిట్లే వర్తించెదను. నే నేదో యొక పథకము గుదుర్చుకొనితినేని దానిప్రకారము నడుచు టొప్పును. కావున నేను బ్రతిదినము యావజ్జీవము నడువవలసినమార్గ మిట్లు నిశ్చయించుకొనెదను.

1. మితభాషణము. నేనికఁమీఁద స్త్రీలతోనైన మితముగనే భాషించెదను. వ్యర్థాలాపము లాడను. మౌనము మంచిదేయైనను నిప్పటి కొందఱుమౌనుల చర్యలు నాకు రుచింపవు. మౌనవ్రతమునకేమి యుద్దేశము? మనోవిగ్రహము. దానిని బాటింపక నోటిమాటలాడక పలకలమీఁదను, గాగిదములమీఁదనుగొందఱు వ్రాయుదురు. వ్రాయుటు నోటిమాటలాడుటకు నేమిభేదము? వ్రాయుటవలన వృథా విశేషకాలహరణము. ప్రయోజనము. మనోవిగ్రహము రెంటనులేదు. అదియనుగాక పూర్ణమౌనము నాకెట్లు సాధ్యము? కావున స్త్రీలతోను దండ్రులవలెఁ దోఁచివృద్ధులై నాయందుఁ బుత్రికావాత్సల్యము గల పురుషులతోను బాలకులతోను మితముగఁ బహిరంగమున మాటలాడు

దును. యౌవనవంతులతోను,కామవికారదృష్టులతోను బలుకను. పురుషుల ముఖములు కన్నులుచూడఁగానే వారి మనోవికారము బయలుపడును. అట్టివారిగుట్టు గనుఁగొనుట స్త్రీలకొక గొప్పకార్యము కాదు. పురుషులతో మాట లాడునుడును, వీథుల నడుచునపుడును నాకాలివ్రేళ్ళపై దృష్టియుంతును.

2. పోరానిచోటులకును,బనిలేనిచోట్లకును బోను. ఇటుచేసితినేని నిష్కారణనిందలు రాకుండును. ఱంకుతనము దొంగతనము నాతలమీఁదికి రాకుండును.

3. నేనెంత బీదరాలనైనను నాకాలు సేతులాడువఱకు దేహియని యొకరి యొద్దకుఁ దిరిపెమునకైపోను. తిరిపెము గౌరవమును నాశము చేయును. ఒకరు వంటకు వచ్చెదవా యందురు. ఒకరు నీళ్ళకు వచ్చెదవా యందురు. మఱియొకఁడు పండుకోవచ్చెదవా యనును. కావున నా కష్టముచే నేను జీవింపవయును గాని తిరిపెముచేఁ గాదు.

4. నేను బరుండుటకు మంచమాశింపను. దిండుఁ నాశంపను. చాఁపయుండెనా చాలును. లేదా రాత్రి విడిచినచీరపఱుచుకొని పండుకొందును. కాదేని పైఁటపఱచుకొని చేయిదిండుచేసికొని పరుండెదను. కాదేని పైఁటపఱుచుకొని చేయిదిండుచేసికొని పరుండెదను. ఆఁడుతోడు దొరకెనా వారలలోఁబండుకొందును. లేదా తలుపులుబిగించి యొంటిగ నిం బండుకొందును. ఎవ్వరైనఁ దలుపు తట్టిరా తటాలునఁ దలుపుతీయును. వారెవ్వరై నది పూర్వోత్తరము విచారించి క్రొత్తమగవారు కారేని తీయుదును. 10 గంటలకుముందు 4 గంటల కావల నిద్రింపను.

5. తాంబూలము వేసికొనను. సొమ్ములు పెట్టుకొనను. రవిక తొడుగుకొనను. అయ్యో పాడువయస్సు నన్నింకను బీడించుచున్నదే. రవికలేక యెట్లుందును. మగవారివి పాపపుఁ గన్నులే. తూఱరానిచోట్లఁ దూఱును. చొరరానిచోటులఁజొచ్చును. వారి పాపము వారిది,వారిని పాపపుఁగన్నులైన నా కేమందునా? ఏపాపి కేమి బుద్ధిపుట్టునో? స్త్రీలు చీరపైఁట సరిగలేక తిరుగుట మగవారికిఁ దమయంగ విలాసము చూపి రమ్మని పిలుచుటవంటిదే కదా. నేను రవిక తొడగరాదు. గనుకఁ బొదుగుపైఁటవిడిచి యెదమభుజము కుడిభుజముకూడఁగప్పునట్లుచేసి కొంగు రొండితో దోపుదును. ఇఁక సొమ్ములుండినఁగదా యా విచారము. మెడబోఁ బుస్తెయుండెను. అదియుఁ బోయెను. ఇఁక నేమిభయము. కొందఱు మగవారు తమ భార్యలకు సొమ్ములు చేయింపవలయుననిఁ గలిగియు దుఃఖింతురు గాని యక్కఱవేళలఁ దమకును,నిట్టి కష్టదశలఁ దమభార్లలకును,నాదుకొనునని యోజింపరు. ఈ విషయమున వైశ్యులు మేలు. పెండ్లినాఁడే “బావా! కిడెంచి మేలెంచవలయును. పెండ్లి కోమారిత కేమిచెప్పెద” వని మో మోటముచేసి యడుగుదురు. పాశ్చాత్య స్త్రీలుసొమ్ములుధరించుచున్నారా యని మతిమాలిన మగవారందురు. కాని యా స్త్రీలు క్షణ భంగురములైన యుడుపులకుఁబెట్టు విలువలేమగునో యీ రెంటిలో నేది శాశ్వతమో లాభకరమో ప్రయోజనకరమో యాలోచింపరు. ఇంతకు నాభర్తబీదవాఁడు. మేము చేసినది బీదకాఁపురము. ఈ విచారము నాకేల?

సొమ్ము లాయుధములు ముద్దుగుమ్మలకని నాకు సొమ్ములా లేవు. 'వస్త్ర ముఖ్యస్త్వలంకార' యని ముఖ్యాలంకారము విలువగల చీరలులేవు. ఈ రెంటికిని సమానమని చెప్పఁదగిన యలంకారము స్త్రీలకుఁ దలవెండ్రుకలు. అవి దండిగఁ గలవు. వానితో నెన్ని సొగసులైనఁ జేయవచ్చును? సొగసులు చేసికొనుట యెవనిప్రీతికి? పతిప్రీతికిఁ గదా. ఆయన లేఁడాయె. సొగసులు మరగిన విధవ విధవయే యగును. అనఁగా సొగసులు మరగిన ముండకు నూరినిండ మిండలే. వయసు మగవారందఱు మగలే. కావునఁ దలవెండ్రుకలఁదీయింతునా? ఉండిననేమి? సింగారించుకొనకుండిన సరి. తలవెండ్రుకలు తీయించుకొన్న ముండలెందఱు వేశ్యలవలె రాత్రులందు వ్యవహరించుటలేదు? మగవేషములతో మిండగాండ్ర యిండ్లకుఁ బోవుటలేదు? వెండ్రుకలటోపీలు పెట్టుకొని జడలు వేసికొని పూలుపెట్టుకొని సింగారించుకొనుట లేదు? వెండ్రుకలేమిచేసినవి? తలలు బోడులైనఁ దలఁపులు బోడులగునా? అయ్యో కొండంత రెడ్డిపోఁగాఁ బిడికెఁడు బొచ్చునకా యింతవిచారము. ఇఁక నాసొగసు లెవఁడు చూడవలయును? తలవెండ్రుకలు తీయింతునా? చల్లాడములు మేజోళ్ళు,సులోచనములు తలగుడ్డలు ధరించి కోచిబండ్లలో మిండల యిండ్లకుఁబోవు రండల నే నెఱుఁగునా. బోడితలలు వీరినేమి రక్షించెను. తలవెండ్రుకలున్నంతమాత్రమునఁ జెడుదురా. ధనవంతుల కీగతులు. నా కట్టి పాపకారణమైన ధనము వలదు. ఏది యెట్లైనగుఁగాక. నా కీ ధర్మాధర్మవిచారమేల ? స్వమతానుసారము లోకముతోపాటు వర్తించెదను. కుట్టిన గుడ్డ కట్టను తొడుగను. సన్న్యాసినుల కిది విహితచర్యయేకదా.

6. కావిగుడ్డలో మాసిన తెల్లగుడ్డలో కట్టుదును. విలువగుడ్డలుగాని చలువ మడుఁగులుగాని రంగుచీరలఁ గాని కట్టను. 1

7. భోజనమా సాత్త్వికాహారమునే మి త ము గఁ గొందును. ఉప్పు పులుసు కారము చేఁదు వగురుగల పదార్థముల భుజింపను. నూనె యావాలు మొదలైనవానిని దాఁకను. చలిది పాసినది కంపుకొట్టునది యగు

పదార్థములను నెఱ్ఱిగడ్డ తెల్లగడ్డ యింగువ సొరకాయ ముల్లంగిలోనగు వానిని భుజింపను. అటయినఁ బండ్లు, పాలు, పెరుఁగు, తేనె, లడ్డు, జిలేబి నీకెవరు తెచ్చియిత్తురందువా ? ఇవియును నాకు వలదు. అన్నము చాలు. కంది పప్పు పెసలపప్పు చాలు. మజ్జిగచాలును. అల్లము శొంఠి మిరియాలు చాలును. అరఁటిపండ్లు, బిక్కిపండ్లు, పాల పండ్లు, కలివెపండ్లు మొదలైన ఫలములు చాలును. మంచి నీళ్ళు చాలును. అడుకుల పేలపిండియో పేలాలో తపెలంటు మొదలయినవి చాలును. ప్రాణాయామ మెక్కువగు కొలఁది యాహారము తక్కువగును. ఆవల నొంటిపూఁటనే తిందును. సగము కడుపునకుఁ దిని పాతికకడుపు నీళ్ళు త్రాగుదును. జిహ్వను జయించుట చాలఁ గష్టము. అన్ని యింద్రియములను జయించి జిహ్వను జయింపనిది జితేంద్రియురాలు కానేరదు. జిహ్వను జయించినది తక్కిన సాధించుటకే ప్రబలప్రయత్నముచేయవలయును. ఎవఁడు జిహ్వను జయింపలేదో వాఁడు భోగిగాని యోగిఁగాడు సన్న్యాసి గాఁడు. కావుననే యిప్పుడు యోగులమని సన్న్యాసులమని వచ్చువారు దొంగలు. వీరిని నమ్మి దగ్గఱ చేరనేరాదు. కొంద అజీర్ణ మధేమేహాది రోగకారణములచే ఫలాహారము చేయుదురు. వీరి నియతికిఁ గారణము రోగమా యోగమా చేయువారు లేమినా? యని విచారింపవలయును.

ఇన్ని చేసెదవు సంతోషమేకాని నీవా నిఱుపేదరాలవు అయ్యో పాపమను చుట్టములా లేరు. పక్షికైన నొక చెట్టుండును. నీకు నదియులేదు. పగటఁ జచ్చిన వాత బియ్యమునకు, రాత్రి చచ్చిన జివ్వెకు గతిలేని దానవు. నీవు దేహమును రక్షించినఁ గదా యది నిన్ను రక్షించును. దానికేమి యాలోచించితి వంటివా? పుట్టించిన దేవుఁడు పూరిమేపఁడు. ఇంతభూతకోటిని రక్షించు భగవంతునకు నేనొకతెను భారమగుదునా? అయినను నేను జేయవలసిన కృషి చేసెదను. ఫలము దైవాధీనము. నాకు వెచ్చమున కెంత కావలయును? సంవత్సరమునకు మూఁడు చీరలు. మూఁడైదులు పదునైదు రూపాయలు. తిండికిఁ దొలుత నెలకు రూ 5 లు అనుకో. క్రమముగఁ దగ్గిపోవును. కొంతకాలమునకు రూ 2 లే చాలును. ప్రకృతము నెలకు రూ 6-5-0 లు కావలయును. ఇది యెవరిత్తురందువా ? దేహకష్టము చేసిన వచ్చును. ఈ కాలములో గృహిణు లెందఱో నీళ్లు తెచ్చుకోలేనివారు వంటచేసిలోలేని వారునై యితరుల సాహాయ్య మపేక్షించువారున్నారు. అట్టి వారింటికిఁ బోయి గుణవతియగు బుద్ధిమతిగనుండు గృహిణిని జూచి యున్న దున్నట్టుగ "నమ్మా నేను గూటిపేదను. మీయింట వంటచేసెదను. జీతము నా కక్కఱలేదు. నాకన్నముమాత్రము పెట్టెదవా?" యనినఁ గన్నుల కద్దుకొని యుంచుకొనును. నాగుణము చేత మంచిదాననని యామెకుఁ దోఁచెనా నన్నావల వదలనే వదలడు. అదయిన నే నేమి తిందును? పప్పన్నము తిందును. పప్పు చేయనివాఁడు కూరలు చేసి రేని దానిలో నుప్పువేయక కొంతయెత్తియుంచి దానితోఁ దిందును. తక్కిన వేవియు వ్రేల నంటను. ఇట్టి సైరంధ్రు లెందు దొరకుదురు? రాత్రులందు భోజనము చేయను. ఆఁకలికిఁ దాళఁజాల నైతినేని యడుకులో-పేలాలో-పేలపిండియో తిందును. క్రమక్రమముగ వీనిని జాలింతును. ఈ విధముగఁ జూచినఁ గడుపు విచారము మానును. ఇది గాకపోయెనా నాలుగిం నాలుగు బిందెల నీళ్లుపోసితినా రెండణాలు వచ్చును. రవికలు కుట్టియిచ్చితివా రవికకు రెండణా లిత్తురు. జడలు వేసితివా నెలకు 4 అణాలకుఁ దక్కువలేక యిత్తురు. ఇదంతయు నా జీవయాత్రకుఁ జాలదా. ఒకరి యింటియం దుంటినేని నే నితరులేమి చేసినను నేమియన్నను మెల్లగ శాంతిచిత్తమునఁ జెప్పుదును. ఇంటిలోని పిల్లవాండ్రను నా బిడ్డలవలె నాదరింతును. నాస్వాధీనమం దిచ్చిన పదార్థములు నా పదార్థములైనచో నెట్లు వ్యర్థముచేయక వాడుకొందునోయట్లు వాడుకొందును. ప్రొయ్యిమండలేదని నేతిని బ్రొయ్యిలోఁబోయను. బాణలిలోఁ జమురు మిగిలినది బూడిదను బాణిలోఁ బోయను. మంచినీళ్ళుతీసికొని పోవుచున్నానని చెంబులో నెయ్యిపోసికొని పిండి వంట లుంచుకొనిపోవు. వంటయింటిని బరిశుద్ధముగా నుంచుదును. పాత్రములనిరూపూఁటఁ దోమి లోపలవెలుపలఁ గడిగియుంతును. ఇంటివారు నాకు స్వాతంత్ర్యమిచ్చి రేని యిల్లలంకరింతును. లేదా చేయవలసిన యుపాయములు వారికిఁ జెప్పుదును. మంచినీళ్ళు కాఁచవలసియుండిన మరగఁ గాఁచి చల్లార్చికాని పచ్చివికాని చక్కఁగా మడఁతవస్త్రమున వడియఁగట్టి త్రావనిత్తును. ఏ పూఁట కాపూఁట నావస్త్రము నుదికి జాడించి యాఱవేయుదును.

రోగులకుఁ బథ్యపానాదు లమర్పవలసినపు డే విధమున వైద్యుఁడు చెప్పునో యే విధముగఁ జేసిన రోగి కింపుగనుండి పథ్యము గ్రహించునో యట్లే చేయుదును. ఉపకార విషయమున ధర్మవిధిని నెవరికైన నే సాహాయ్యమైనఁ జేయుదును. మలమూత్రములనుగూడ నెత్తిపోయుదును. ఇది యుపకారమని దైవప్రీతిగఁ జేయుదునుగాని మెఱమెచ్చులకుఁగాని డంభమునకుఁగాని చేయను. పడుకకాచి యుండవలసినయెడల నిద్దురపోవక మేలుకనియే యుందును. ఇట్లుపకార బుద్ధితోఁ జేయుచుంటినేని నాకుఁ గూటికి గుడ్డకుఁ గఱవా? ఇది సేవకాదా యందువేమో. నిజముగ సేవయే. నేను జేయునది కేవలము పొట్టకొఱకేకాదు. ధనాశచేగాదు. నాతిండి నానడవడి చూచినవారు దీనిని తెలిసికొనఁగలరు. నీచసేవకర్తవ్యము గాదుగాని యుపకారసేవ నీచముగాదు. జీవకోటియంతయు సేవచేతనే తరింపవలసియున్నది. దానిని విడిచిన వేఱుమార్గములేదు. దేహరక్షణమున కెంతమాత్రము కావలయునో యంతే గ్రహింతురు. ఇట్టిది దోషముకాదనియే సర్వమతాచార్య సమ్మతము. సోమరియై తిరపమెత్తి తిని

వన్నె విసనకఱ్ఱలవలెఁ దిరుగుటకంటె నిది యుత్తమముగదా. చేతిని నోటిని మఱియొకదానిని బరిశుద్ధముగ నుంచుకొంటినేని మూఁడులోకములందును నాకు భయములేదు, జయమే కలదు. ఒకరి యింటనుంటినేని వస్త్ర ములకై నేను వేఱుగఁ బాటుపడవలసిన పనియుండదు. ఆ యిల్లాలు కట్టి పాఱవైచిన ప్రాఁతచీరయే నాకుఁజాలును. అంతియకాక జీతము తీసికొనిన కూటికిమాత్రము సేవచేయు నాకు మానము పోవునట్లు వస్త్రాభావము తటస్థి ంచిన నా యిల్లాలు చూచుచుండునా. నా మానమువంటిదిగాదాయామె మానము. అదిగాక స్త్రీజాతియందొక భావగతసంకేతము కలదు. అది వ్రాయని శాసనము. అది యేజాతిదైనను నొక స్త్రీమానము పోవుట మఱియొకస్త్రీ సహింపదు. తాను గట్టిన చీరలోనైనఁ గొంత చించి యిచ్చును. ఒక స్త్రీమానము పోయిన నందఱస్త్రీల మానము పోయినట్లే. అందఱు స్వరూపము లొక్కటేకదా. గూఢమును జాటుదనంబునుగాకయుండు నంతవఱకే స్త్రీలకుఁ బురుషులు పక్షులు వలలోఁజిక్కుట, ఆరబయట బయలుగఁ జీర రవిక విప్పి స్త్రీ నిలఁబడెనేని సాధారణముగఁ బురుషులు దుష్కాములు తప్పఁ దక్కిన వారు దానిని జూచి రాక్షసియని తొలఁగిపోదురు. కావుననే సంగమవేళ యందును దీపము వెలుతురుకూడ నుండరాదందురు. సాధారణముగ స్త్రీలుండనీయరు, బట్టబయలైన గుట్టురట్టు. ఒ క కథ జ్ఞప్తి కివచ్చుచున్నది. ఒకతల్లి కి నొకకొడుకు. వీఁడు వేశ్యాలంపటుఁడు. కొంపలో నున్న దంతయు నూడ్చి దానికి వాఁడు పెట్టుటయే కాక తుదకుఁ దల్లి ముక్కుపుడకనుగూడఁ దీసికొనిపోఁదలఁచి యమ్మా దాని నా కీయవే యని యడిగెను. ఆతల్లి యిట్లు చెప్పెను. నాయనా నీ సంతోషమే నా సంతోషము. నీకు దీని నిచ్చెదను. నీ లంజకిమ్ము. అయిన నొకమాట. దీనిని నీవు దీసికొనిపోయి నీలంజకుఁ జూపించి దీనిని నీవు దిసమొలతో మొగ్గవాలి కంటితోఁ దీసికొంటివేని యిచ్చెదననుము. నీకెదురుగ మొగ్గవాలు మనుము. ఇట్లది చేసెనేని నిది దానికిమ్ము అట్లది చేయకున్న నీయకుమనిచెప్పి ముక్కుపుడక దీసి యాపుత్రరత్నమున కిచ్చెను. వాఁడును సంతో షముతోఁ బోయి లంజకు జూపించి నీవు నాకెదురుగ దిసమొలతో నిలఁబడి మొగ్గవాలి కంటితో దీనిని దీసికొ ంటివేని నీ కిచ్చెదననెను. అట్టులే కానిమ్మని యది యట్లే చేసెను. అప్పుడు వాని కన్నులకు దాని మర్మాంగము సర్వాసహ్యముగఁ దోఁచి యీ దొండికా నా కొంప యంతయు దోఁచిపెట్టితినని జుగుప్సపడుచు వెంటనే యింటికిఁబోయి యదిమొదలు దాని మొగమైనఁ జూచుట మానెను. కావుననే కులస్త్రీలు ప్రాణమైనఁ బోఁగొట్టుకొం దురు గాని మానముఁ బోఁగొట్టుకొనరు.

పరీక్షలయం దుత్తీర్ణులై పండితులై దేశము నుద్ధరించువారుద్ధరింతురుగాక. ఈ విధముగ వర్తించి నన్ను నా మగని నా తల్లిదండ్రులను నా మగని తల్లిదండ్రులను నేనుద్ధరింతును.

తిండి మానుటచేతను జింపిగుడ్డలు కావిగుడ్డలు కట్టుటచేతను మోక్షమబ్బునా? అబ్బదు. కాని యివి రెండును దానికి ముఖ్యసాధనములు. మోక్షమునకు బంధమునకు మనస్సేకారణము. మనస్సుకూడఁ బ్రకృతివి కారమే. ఇది యాహారమునుబట్టి యుండును. మాంసభక్షకుల మనస్సు క్రూరముగానే యుండును. వారియందు దయ తక్కువ. సాత్త్వికాహారము తినువారు సత్త్వగుణము విశేషముగలవారై యుందురు. గుడ్డలు మోక్షము నీయవు. చలువ విలు గుడ్డలైనను, మాసిన కావిగుడ్డలైనను నొకటేకాని చలువ విలువ వస్త్రములు ధరించిన వెంటనే యహంకార గర్వములు కన్నుల కెగఁదట్టును. అంతకు ముందులేని యేదో యొక గొప్పతనము తమకు వచ్చినట్టి లీ వస్త్రధారులు దలఁతురు. వారియందు లేని యీ గొప్పతనము చాకలవారివలన సాలెవారివలన వచ్చెను. అహం కార గర్వములే పతన హేతువులు. కావున వాని సాంగత్యము మానవలయును. మాసిన గుడ్డలు చింపి గుడ్డలు గలవారు వినయ విధేయతలు కలవారై తమ్ముల్పులుగ భావింతురు. నైచ్యానుసంధానమే యభ్యుదయ కారణము. నిజమైన యోగ్యతగలవారెట్టి వస్త్రముల ధరించిన నొకటే. వస్త్రాలం కారాదులవలన వచ్చు యోగ్యత యోగ్యతకాదు.

నేను దాంబూలము మంచము పఱపు మానుదును. చిఱుచాఁపమీఁదనో పైఁట పఱచుకొనియో పరుండు దను. నాహస్తమే నాకుఁ దలగడ. అది కాదేని పైఁట కొంచెము పొడుగుగాఁ దీసి చుట్ట చుట్టి తలక్రింద నుంచు కొందును. వెల్లకిలఁ బరుండును. సంచయకాంక్ష మానుదును. చేతనైన యుపకార మెవ్వరికైనఁ జేయుదును. ఇంత యేల నా మగఁడున్నప్పుడు చక్కఁగ వర్తించుట గొప్పగాదు. ఇఁక మీఁద వర్తించుటే గొప్ప.

ఈవిధమైన నడవడిచే దేహమును మనస్సును నాకు స్వాధీనపడఁ జేసికొనుచు జీవుఁడు కడఁదేఱు మార్గమును నాలోచింతును. ఈవిషయము నాకేమియుఁ దెలియదే. ఏమియాలోచింతను? యోగుల యొద్దకుఁ బోదునా ? వారోయోగమనఁగాఁ గూడిక. వేనికూడిక? ప్రకృతి పురుషుల కూడిక. నీవు ప్రకృతి స్వరూపవు. నేను బురుషుఁడను. తస్మిన్‌గర్భం దధామ్యహమ్" "ధీరాఃపరిజా నంతియోని"మ్మని చెప్పి మనయిరువుర గాఢమైన కూడిక సంయోగమని వేఁకటి వచ్చునట్టు చేయుదురు. ఇఁక వేదాంతుల యొద్దకుఁ బోదునా. వారు సర్వము బ్రహ్మము నీవు బ్రహ్మము; నేను బ్రహ్మము, కుక్కబ్రహ్మము, గాడిద బ్రహ్మము. సర్వము బ్రహ్మము? బ్రహ్మముగాని దేదియులేదు. కావున నందఱమొక్కటే. నీవు నేనను ద్వైతవాసన నిర్మూలింపవలయును. భేదబుద్ధిమానవలయును. నీజీవాత్మ నాజీవాత్మ యొకటే; నీ దేహము నాదేహము నొకటే. రెండు దేహములు పంచభూతముల పంచీకరణ

మువలననైనవే. ఇఁక భేదమెందువచ్చెను? ద్వైతవాసన నిర్బీజముగ నశింపఁ జేసినఁగాని యద్వైత సిద్ధిగలుగదు. అహం మమయనునవి వదలవలయును. గురువే దైవమని నమ్మవలయును అర్థము దేహము గురువులవారి కర్పింపవలయును. ఏమి తెచ్చితివో గురుదక్షిణ పెట్టుము. ఏదిలేకున్న నీ దేహమున్నదిగదా. అద్వైతజ్ఞానము కుదిరి నీ దేహము నా దేహము నొకటేయని స్థిరబుద్ధి గలదానవైతివేని మన రెండు దేహములు కలుపుము. ఎట్లు కలిపెదవో చూచెదను. నేను జేయుచున్నాను నీవు చేయించుకొనచున్నావను భేదబుద్ధిమానుము. ఇంద్రియ మింద్రియములోఁ దూఱును. కర్తృత్వాభిమానము మానుము. అని తొడమీఁదఁ జేయివైచి శిష్యురా లులికిపడెనా నీకు ద్వైతవాసన స్థిరపడులేదు. పొమ్మనును.

నిజమైన వేదాంతము నీటఁ గలిగినది. ఇట్టికలువాయి వేదాంతములు మెట్టవేదాంతములు ప్రబలినవి. నలు నది సంవత్సరములవఱకు నడవీధి యాఁడు కుక్కలవలెనున్న స్త్రీలు ముసుఁగులు తలమీఁదికి రాఁగానే పంచీకరణము ముగ్గులు భగవద్గీతలు పంచదసులు చంకఁబెట్టి యింటింటికి బోధచేయ వచ్చుచున్నారు ఈ వేదాంతినులను జక్కఁబెట్టువాఁడు కృతాంతుఁడొక్కఁడే కాఁబోలు. ఇఁకఁ గొందఱు మంత్రోపదేశము చేసెదము రమ్మందురు. ఒంటరిగ గది లోనికి నడిరేయి రమ్మని "నేను గృష్ణుఁడు నీవు రాధ. ఇదియే బృందావన"మని యుపదేశింతురు. ఇప్పుడు కొందఱు ముండలుకూడమంత్రోపదేశము చేయువారేయైరి. వీరు చెప్పునది మంత్రమో కామతంత్రమో రూపాయలు దక్షిణ పెట్టకున్నఁ గోపముచే నుపదేశము చేయరు. వీరు చెప్పెడు వేదాంతము శోకాంతమే.

వేదాంత మనఁగా నేమి? జీవాత్మ పరమాత్మలకుఁ గలసంబంధజ్ఞానమే. ఈ రెంటికి నేమి సంబంధము? నే నద్వైతినిఁ గదా. నాకు శ్రీ శంకరులే పరమగురువుగదా. వారి మాటలు వేదవాక్యములే గదా. వారిచర్య లనుసరింపఁ దగినవికదా. ఇప్పటి యీకలువాయి వేదాంతులమాట లటుండవచ్చి వారేమి చెప్పిరో యట్లే వర్తించి కదదేఱెదను. జీవాత్మ పరమాత్మసంబంధము గుఱించి

శ్లో. సత్యపిభేదాపగమే నాథ ! తవాహం నచమామకీన త్వమ్,
సాముద్రోహి తరంగ ః క్వచన సముద్రోహి నతారంగః.

జీవాత్మ పరమాత్మలకు భేదము లేమి సత్యమేకాని నాథా నేను నీవాఁడను. నీవు నావాఁడవు కావు. అల సముద్రము దగును గాని సముద్ర మలదిగాదు. అనికదా వారు చెప్పిరి. పరమాత్మ సముద్రుఁడు జీవాత్మ యల సూర్యుఁడు భగవంతుఁడు. కిరణ మల. వాస్తవ మిటుండ నల తాఁనే సముద్రమనుకొనినను గిరణము తానే సూర్యుఁడనుకొనినను బ్రయోజనమేమి? భగవంతుఁడు జ్ఞానానందమయుఁడే. జీవాత్మ జ్ఞానానందమయుఁడే. వెలుతరు-వేఁడి మిణుఁగురునందుఁ బెద్దజ్వాలయందు సమానములే. చక్రవర్తియు మనుష్యుఁడే. బికారియు మనుష్యుఁడే. భేదములేదా. ఈ విధముగ మహా వాక్యముల కర్థము గ్రహింపవలయు. ఈ మాత్రమాలోచింపక తామే జగత్సృష్టి స్థితియ సంహారములు సేయువారివలె నేనే బ్రహ్మమని నే నెట్లుండిన నేమని యేమిచేసిన నేమని తలఁచు వారికంటె భ్రష్టులెవ్వరు ? చెఱసాలయందుండువాఁడు తాను స్వంతత్రుఁడనని చక్రవర్తినని దినమునకు లక్షమాఱులు వదఁరగానే స్వతంత్రుడగునా? చక్రవర్తియగునా ? మంచమెక్కిన రోగి నే నారోగ్యవంతుఁడననుకొని యపథ్య భోజనము చేసెనేని బాగుపడునా? ఇంతమాత్ర మాలోచింపక యా శంకరుల వారు కర్మాద్వైతం నకర్తవ్యమ్మని శాసించిరి. వీరలే బ్రహ్మమైనచో నాఁకలిడప్పులు, కూడు గుడ్డలు, దుడ్డు దుగ్గాణలు, కల్లు సారాయములు, మద్యమాంసములు నేటికో, అహంబ్రహ్మాస్మియనుది యవినయవాక్యమని శంకరులే "అవినయమపనయ విష్ణో" యని చెప్పిరిగదా. బ్రహ్మత్వము నాకు లభించువఱకు అహంబ్రహ్మాస్మియని నధికారము నాకు లేదనికదా రామకృష్ణపరమహంసులు చెప్పిరి.

జీవాత్మ పరమాత్మ భేదము నట్లుచెప్పి సంసారము నుండి తరించు సాధనమార్గ మేమిచెప్పిరో చూతము.

"నారాయణ ! కరుణాలయ ! శరణం కరవాణి తావకౌ చరణౌ ఇతిషట్పదీ మదీయే హృదయసరోజే సదా వసతు".

అని సెలవిచ్చిరి. తావకౌ చరణౌ అనుటచే భగవంతుఁడు సాకారుఁ డనియు నారాయణ యనుటచే నామవిశిష్టుఁడనియు కరుణాలయ యనుటచే హేయగుణ రహితకల్యాణగుణ సహితుఁడనియు శరణం కరవాణి యనుటచే భక్తిప్రపత్తులే తరణోపాయములనియు వారి యభిప్రాయమైనట్టు స్పష్టపడియెఁగదా. 'సకృదపియేన మురారి సమర్చాకురుతే తస్యయమోపి నచర్చామ్' అనియువారేభజగోవిందమ్మనియు నుపదేశించిరి కదా. వారు చంద్రమౌళీశ్వరుఁ బూజింప రైరో లక్ష్మీనృసింహ మమ దేహికరావలంబమ్మని ధ్యానింపరైరో. కాఁబట్టి నా కా యోగమువలదు. ఈ వేదాంతము వలదు. ఆ మంత్రము వలదు. ప్రతిదిన ముదయమున 3 గంటలకు హరిహరియని నిద్రలేతుము. కాలుసేతులు కడిగికొని శుచివై నాకువచ్చిన పాటలో పద్యములో శ్లోకములో గజేంద్రమోక్షము ప్రాతఃకాల స్మరణీయశ్లోకములు సుప్రభాతములు స్తోత్రములు వినువారుండిన గట్టిగఁజెప్పుదును. అది నిద్రపోదు; మమ్ము నిద్దురపోనీయ దనువారుండిన నాలో నేనే చెప్పుకొందును. ఆవలఁ బ్రాతఃకాలకృత్యముల తీర్తును. పని

చేయునవి కాలుసేతులేగాని నోరుగాదుగదా. ఏపనిచేయుచున్నను నోట శ్రీరామయనియో శ్రీకృష్ణ యనియో నారాయణయనియో యేదో భగవన్నామము సంకీర్తనము చేయుచుందును. అన్ని కార్యములు భగవత్కైంకర్యము గానే యెంచి భగవదర్పణము చేయుచుందును. ఏది భుజించినను ముందు స్వామికి మనసున నివేదించియే తిందును. తులసీపూజచేయుదును. రామకోటి వ్రాయుదును. ఇంతబియ్యము ముందు పోసికొని శ్రీరామ శ్రీరామయని యొక్కొక్క నిండుబియ్యపుగింజ విరుగనిదిగ నేర్పతిచి వేతేయుంచి యవి యొకసేరో రెండుసేర్లో కాఁగానే యెవనికైన సద్బ్రాహ్మణునకు దానము చేయుదును. లేక వండి స్వామికి నివేదించి బాదసాదులకిత్తును ముప్పూఁట నాసనముననుండి ప్రాణాయామ మభ్యసింతును. శ్రీభాగవతమున నున్నట్లు ధ్యానింతును. ఇట్లు భగవద్ధ్యానమందే కాలము గడుపుదును. నిద్రయును భగవత్సేవయేకదా. ఈప్రకారము నడచు కొంటినేని తక్కిన విషయములు భగవంతుఁడే తెలుపును. మంచి కార్యములు చేయువారికి దుర్గతిలేదనియు భగవద్భక్తులకు భయము లేదనియుఁ జెప్పిన భగవంతుని వాక్యములే శరణము.

శ్లో. సాంకేత్యం పారిహాస్యం వా, స్తోభం హేలనమేవవా,
వైకుంఠ నామగ్రహణ,మశేషాఘ వినాశనమ్

శ్లో. హరిర్హరతి పాపాని,దుష్టచిత్తై రపిస్మృతః,
అనిచ్ఛయాపి సంస్పృష్టో,దహత్యేవహిపావకః.

శ్లో. అవశేనాపి యన్నామ్ని, కీర్తితే సర్వపాతకై ః,
పుమాన్ విముచ్యతే సద్యః, సింహత్రస్తై ర్మృగైరివ.

శ్లో. ఏతావతాల మఘు, నిర్హరణాయపుంసాం
సంకీర్తనం భగవతో, గుణకర్మానామ్నాం,
ఆక్రుస్యపుత్ర,మఘవాన్యదజామిళోపి
నారాయణేతి మ్రియ,మాణుపైతిముక్తిమ్.

శ్లో. సకృత్స్మృతోపి గోవిందో,నృణం జన్మాశతైశ్చితమ్,
పాపరాశిం దహత్యాశు,తూలరాశి మివానలః.

శ్లో. ఏషమే సర్వధర్మణాం, ధర్మోధికతమోమతః,
యద్భక్త్యా పుండరీకాక్షం, స్తవైరర్చేన్నరస్సదా.

శ్లో. పురుషస్సపరః పార్థ భక్త్యా లభ్యస్త్వ నన్యయా,

శ్లో. భక్త్యా త్వనన్యయాశక్యః.

శ్లో. భక్త్యా మామభిజానాతి.

శ్లో. భక్త్యా విచ్ఛిన్నయాముక్తి ః

శ్లో. పరమాత్మని గోవిందే, భక్తిరవ్యభిచారిణీ,
ప్రయచ్ఛతినృణాం ముక్తిం, మాతే భూదత్రసంశయః.

శ్లో. అహో హరిం బ్రువన్నేవ ముక్తి మేత్యప్యహోఅహో,
అహో అహో సులభతా కృపాచేయ మహో అహో.

శ్లో. శరీరారోగ్య మర్థాంశ్చ భోగాంశ్చైవాను షంగికాన్
దదాతి ధ్యానినాం నిత్య మపవర్గ ప్రదోహరిః.

శ్లో. కలే ర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః,
నారాయణేతి యస్యాస్తే వర్తతే నామ మంగళమ్,
నారాయణస్త మన్యాస్తే వత్సం గౌరివ వత్సలా.

ఒకరి పేరుపెట్టియైనను,బరిహాసమునకైనను మఱి యే కారణములచేనైనను నారాయణ నామగ్రహణము సర్వపాపహరము. తెలియక తాఁకినను నిప్పు తన్నుఁదాఁకినవారి నెట్లు దహించునో యట్టులే దుష్టచిత్తులై యిచ్ఛలేక హరినారాయణయనినను వారి పాపములను భగవంతుఁడు హరించును. భగవన్నామము కీర్తనము మనుష్యుంబాప ముక్తుఁజేయుటకుఁజాలును. మహాపాపియగు నజామిళుఁడు మరణవేళ బిడ్డపేరుపెట్టి నారాయణా యని పిలిచి ముక్తిని గాంచెఁగదా. ఎప్పుడోయొకసారి గోవిందాయని భగవంతుని నామము స్మరించినను నది దూది కంట్లమును నిప్పుమిణుఁగురువలె దహించును. భగవంతుని భక్తితో స్తుతిచేతఁ బూజచేయుటే యన్ని ధర్మములకన్న నెక్కువధర్మము. భగవంతుఁ డనన్యభక్తిచేతనేలభ్యుఁడు, భక్తిచేతనే నన్ను నరుఁడు తెలిసికొనఁగల డు. అవిచ్ఛిన్న భక్తిచేతనేముక్తి. పరమాత్మయగు గోవిందుని యందలిభక్తి యే నరులకు ముక్తినిచ్చును; సందేహము లేదు. ఎవరికి విష్ణువు ప్రియుఁడో యెవరు విష్ణువునకుఁ బ్రియలో యట్టి భక్తులు, భగవంతుఁడే తమకు గతిగాఁ గలవారు మరల జన్మింపరు.

శ్లో. యేషాం విష్ణు, ప్రియోనిత్యం యేవిష్ణోస్సతతం ప్రియాః
నతే పునః సంభవంతి తద్భక్తాస్తత్పరాయణాః.

ఇట్టి యనేక ప్రయాణము లుండుటచే నన్నిటికి నశక్తురాలనగు నేను గర్మయోగమును జేయఁజాలను. జ్ఞాన యోగమును జేయఁజాలను. అష్టాంగయోగమును సాధింపలేను. రామహరే కృష్ణహరే రామకృష్ణ గోవింద నారాయణ అచ్యుతానంత గోవింద శ్రీరామ రామ రామయని తగిన గురువు దొరకువఱకు నిట్లు భగవన్నామ ముచ్చరింతును. తక్కిన యన్ని యోగములకంటె నిదియే సులభము–సుకరము–సుసాధ్యము–నిర్భయము–నిరపా యము–నిశ్చయఫలదము–నిర్వాణప్రదము–శ్రేష్ఠము–భగవత్ప్రీతికరము. ఆవల గురువు చెప్పినట్లు చేయుదును.

అని యిట్లు తీర్మానించుకొని యామె యాప్రకారమే వర్తించెను. కావున నీవును దీనిలో నీకెంతసాధ్యమో యెంతత యన్వయించునో యోచించి నీయిష్టప్రకారము వర్తింపుము. నీకుఁ దల్లిదండ్రులున్నారు. మగని యింటి వారున్నారు. దారిద్ర్యభయములేదు. కావున మీఁద వివరించిన స్త్రీ కున్న దుర్దశ నీకులేదు. మగఁడుపోయెనా స్త్రీకి సంసారములేదు. స్త్రీపోయెనా మగనికి సంసారములేదు. భార్యాభర్త యిరువురుండిననే సంసారము. కొడుకు కోడలుండిరా యది వారి సంసారమే కాని నీ సంసారము కాదు. ఆఁడుదానికి నత్తగారిల్లే స్వగృహము. పుట్టినిల్లు గాదు. అత్తగారింటివారు కూడు నీళ్ళు పెట్టకయు నితరవిధముల బాధ పెట్టియు నీ వుండుట సహింపరేని మగఁడులేని నీవు పుట్టినింటికిఁ బోవచ్చును. మీఁదఁ జెప్పఁబడిన స్త్రీవలె నడుచుకొనువారి నెట్టి క్రూరులైన నుండవలదనరు. అత్తగారింటి వారెవ్వరు లేకుండినను,వారుండినీనుండి నను బుట్ట నిల్లుచేరవచ్చును. దానము చేయునపుడు ప్రతిపదార్థవిషయమున దాత 'నమమ' నాదిగాదు అని చెప్పునుగాని కన్యాదాన విషయమున మాత్ర మామాట దాత చెప్పుటలేదు. ఏలన నిట్టికష్టదశ వచ్చినపుడు మరలఁ దన యొద్దకువచ్చియుండుటకే పుట్టినింట నుండుటకంటె నత్తగారింట నుండుటే స్త్రీకి శ్రేయస్కరము. కీర్తికరము. అత్తగారిల్లయినను నీ పాలిటికి మాత్రమే. పుట్టినిల్లయినను నీ పాలిటికిఁ జలిపందిరియే. రెండును నీవికావు. కొడుకులుండినఁ గొడుకుల దగును గాని నీదికాదు. నీ యిల్లు నీ మగనితోనే పోయినది. కాఁబట్టి యెందున్నను దోడికోడండ్రుతోఁగాని వదినెమఱఁ దండ్రతోఁగాని కలహమాడకుము. వారిపై నీ వధికారము చేయకుము. వారికి నీ వణఁగి మణఁగియే వర్తింపుము. మంచిమాటలే యాడుము. వారికేదైన హితము చెప్పవలసియుండిన మంచిమాటలతోఁ జెప్పుము. వారిమీఁద నేదియు మగవారితోఁ గాని, బయటివారితోఁగాని చెప్పకుము. వారి పుణ్యపాపములు నిన్నంటవు. నీవు కాలము గడుపుకొనుటకై వారియింట నున్న దానవనుట మఱవకుము. చచ్చినను బ్రతికినను మగఁడే దైవమనుకొనుము. బ్రతికినపుడు చేసిన సేవ గొప్పకాదు. ఇప్పుడు చేయునదే గొప్ప. పరలోక మొకటున్నదని దేవుఁ డొకఁడున్నాఁడని మనోవాక్కాయములచే మనము చేయు కార్యముల నన్నిటిని జూచువారున్నారని మఱవకుము. ఈ లోకమునఁ బరలోకమునఁగూడ బాగుపడురీతి వర్తింపుము. అత్తయింటనుండినను,బుట్టినింటనుండినను నీవు చాకిరిచేయు చుండిననే గౌరవము. ఒక గడియ ప్రాలుమాలితివా తండ్రిమొగము మాడ్చును. తల్లి మూతి విఱుచును. అత్త సొణగ నారంభించును. కావునఁ బుట్టినల్లైనను అత్తయిల్లైనను పరగృహముగనే యెంచి వర్తింపుము. స్త్రీల మనో గతములన్నియు నూహించి వ్రాయునంతటికి శక్తిగలవాఁడనునుగాను. అడిగినఁ జెప్పెదను. ముంటిబాధ ముల్లు గ్రుచ్చుకొన్న వానికిఁ దెలియును. ఇందుఁజెప్పఁబడిన కామమ్మ మఱియెవతెయొకాదు. నేనే. నాకేయిట్టి దశపటినదని తలఁచి యిట్టి దశయందు నేనెట్లు వర్తింపవలయునా యని యూహించి నీకై వ్రాసితిని. సూక్ష్మవిషయము లనావ శ్యకములు. అవి తమంతటఁదామే తోఁచునని వానిని వ్రాయనైతిని . స్థూలభావములు మాత్రమే వ్రాసితిని. ఎట్టి

దశయందుండు మగవారుగాని యాఁడువారుగాని మనుష్యులుగా నుండువారందఱు నాలోచింపవలసినది యొక విషయముగలదు. ప్రకృతి పురుషసంయోగముచే నైనది దేహము. అందు దేహము ప్రకృతి పరిణామము పురుషుఁడు దీని యందుండి యీ దేహమునాది యనుకొనువాఁడు. ఆఁకలి దప్పులు సుఖదుఃఖములు శోకసంతోషములు జరామరణములులోనైనవన్నియు దేహసంబంధములు. దేహమే తానను దురభిమానవశమున నా కాఁగలి. నాకు దప్పి,నాకు సుఖము,నాకు శోకమునని జీవుఁడు తలంచుచుండును. దేహపోషణ దేహాలంకారములే సంతోష కారణమని భ్రమించుచుండును. దేహ మశాశ్వతము గావున దానికి సంబంధించిన వన్నియు నశాశ్వతములే. జీవుఁడు నిత్యుఁడు కావున నాయనకు సంబంధించినవన్నియు నిత్యములే. నిత్యములయిన వానికే బుద్ధిమంతుఁడు పాటుపడవలయును. అశాశ్వత దేహమునందు నభిమానముండు వఱకు శాశ్వత జీవునందు మనస్సుపోదు. ఈ దేహము పోవునను భయమక్కఱలేదు. ఈ దేహముపోయిన దీనిని మించినదానిని మనము సంపాదింపవచ్చును. మన కెఱుక లేక మంచి దేహమైనఁ జెడ్డదేహమైనరాదు. మనదేహములు మనము సంకల్పించి సృష్టించుకొన్నవే. కాఁబట్టి దేహపోషణము ప్రధానకార్యముగాదు. దానివలనఁ మనకుఁ గార్యము కావలసినయున్నది గనుకఁ గేవలము దాని నుపేక్షింపక యెంతమాత్ర మాహారమిచ్చినది పడిపోక యుండునో యంతమాత్రమే యిచ్చును నంతమాత్రమే యాదరించుచుఁ దక్కిన కాలమంతయు నాత్మనుద్ధరించుటయందు వినియోగింపవలయును. శ్రీ శంకరాచార్యులవారి

శ్లో ॥ "శరీరపోషణార్థీసన్, యాఆత్మానం దిదృక్షతి
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి"

యీ శ్లోకము బంగారక్షరములతో వ్రాసియుంచుకొనఁ దగినది.

అనఁగా నెవఁడు (దేహధారణమందుఁ గాదు) దేహపోషణమం దాసక్తి గలవాఁడై యాత్మ నవలోకించు కోరిక గలవాఁ డగునో వాఁడు మొసలిని దెప్పయనుకొని యేఱుదాఁట యత్నించువాఁడగును.

ఇంతవఱకు వ్రాసి ముగించి పుస్తకమును గ్రిందనుంచి కాలహరణముచేయ నొల్లక చదువుటకై వేఱొకపుస్తకమును దెఱవఁగా నాపుటయందే యీక్రింది శ్లోకములు గానవచ్చెను. అవి ప్రస్తావనయందుండు విషయమునకు సంబంధించినవిగనుండుటేగాక మీఁద నేను వ్రాసినది యాశ్లోకములకు వ్యాఖ్యానముగఁ గానవచ్చుటఁజేసి యాసూత్రశ్లోకముల నీక్రింద ననువదించుచున్నాను.

శ్లో ॥ పత్యౌ మృ తేపి యాయోషి, ద్వైధవ్యం పాలయేత్క్వచిత్
సా పునః ప్రాప్య భర్తారం, స్వర్గభోగాన్ సమశ్నుతే.

మగఁడు మరణించిన స్త్రీ విధవాధర్మములను గొంచెమైన విడువక పాలించెనేని యామె మరల మగనిఁగూడి స్వర్గభోగములను సంపూర్ణముగ ననుభవించును. (మగఁడు మరణించెనేని యతనిభార్య శీలపతిగనుండి విధవాధర్మమును రక్షించుచుండిన యెడల నా పుణ్యురాలు మరణించివచ్చు వఱకు నామెపతి స్వర్గము నందే యామెరాకకై యెదురు చూచుచునుండి యామె శీలవ్రతనిష్ఠలచేఁ బాపముక్తురాలైరాఁగా నామెనుగూడి యుండును. ఆవల వారే భార్యాభర్తలై జనించి మరల సంపూర్ణ సుఖముల ననుభవింతురు. అహల్యాచరిత్ర తత్త్వమిదియే. రెండుచిప్పలు గలసి యొకగింజగా నై నట్టు మొదటినుండి భార్యాభర్తలుగా వచ్చువారిలో ననుకూలదాంపత్యమే యుండును. అటుగాక స్త్రీగాని,పురుషుడుగాని కామాసక్తిచే వ్యభిచరించి యితరుకాంక్ష గలిగియుండిననే గతజన్మమున దొంగమగఁడే యీజన్మమున మగఁడగుటచే ననుకూలతలేని దాంపత్యము తటస్థించును. అట్టులే తండ్రితో విరోధించు కొడు కా తండ్రికిఁ బుట్టినవాఁడు గాఁడు. కులదైవతమును ద్వేషించువాఁడు చండాలునకుఁ బుట్టినవాఁడని శాస్త్రములు చెప్పుచున్నవి) మొదటికొడుకే కొడుకు. ప్రథమభార్యయే భార్య. తక్కినవారు కామసంబంధులు.

శ్లో ॥ మృతేభర్తరి యా నారీ,బ్రహ్మచర్యే వ్యవస్థితా,
సామృతా లభతే స్వర్గం, యథాతే బ్రహ్మచారిణః.

పతి మరణించిన స్త్రీ బ్రహ్మచర్యవ్రతమం దుండెనేని యామె మరణించి బ్రహ్మచర్య వ్రతనిష్ఠులవలె స్వర్గమును బొందును.

శ్లో ॥ పర్యంకశాయినీ నారీ, విధవా పాతయే త్పతిమ్
తస్మా ద్భూశయనం కార్యం,పతిసౌఖ్య సమీహయా.

ఏ విధవ మంచముమీఁదఁగాని పఱపుమీఁదఁగాని పండుకొనునో యది తన మగనిని స్వర్గమునుండి భ్రష్టునిఁజేసి యధోలోకమునఁ ద్రోయును. కావున మగనిసౌఖ్యమం దిచ్ఛగల విధవ భూమిమీఁదనే పండుకొనవలయును.

శ్లో ॥ నచాంగోద్వర్తనం కార్యం స్త్రియా విధవయా క్వచిత్ ,
గంధ ద్రవ్యస్య సంభోగో నై వ కార్య స్త థా క్వచిత్ ,
తర్పణం ప్రత్యహం భర్తుః కుర్యాత్కు శతిలోదకై ః,
విష్ణోస్తుపూజనం కార్యం పతిబుద్ధ్యా నచా న్యథా,
పతిమేవ సదా ధ్యాయేత్ విష్ణురూపధరం పరమ్.

విధవ తన దేహమునకు నలుగుపెట్టుకొనుట,పరిమళ ద్రవ్యాదులనుభవించుట బొత్తుగ మానవలయును ప్రతిదినము దర్భలు నూగులు నీళ్ళు వీనితో భర్త నుద్దేశించి తర్పణము చేయవలయును. విష్ణువే తనభర్తయను భావముతోనే విష్ణువును బూజింపవలయును. తనమగఁడు విష్ణురూపధరుండేయను తలంపుతో మగనినే ధ్యానిం పవలయును. అనఁగా స్త్రీకి మగనిని విడిచిన వేఱు దేవుఁడు లేఁడు. కావున నారాయణుఁడేతనభర్త. తనభర్తయే నారాయణుఁడను తలంపుతో c బతిని దైవమును బూజింపవలయును. తనమగఁడు మనుష్యమాత్రుఁడు. వాఁడు గాక తన్ను రక్షించుటకు మఱి వేఱే దేవుఁడొకఁ డున్నాఁడు. అని తలఁచునది పతివ్రతగాదు. దేవునిఁబూజించున పుడు తన మగనిని బూజించునట్లు తలంపవలయును. తన మగనిని బూజించునపుడు దేవునిc బూజించుచున్నా నను కొనవలయును. వేఱుభావము కారాదు. మగఁడు మరణించినను మనోరూపముతోఁ దనతోడ నున్నాఁడనియే విధవ తలంపవలయును. బ్రతికియున్నప్పు డాయన విషయమై యేయే కార్యములం దెట్లెట్లు వర్తించుచుండెనో యాప్రకారమే యిప్పుడు వర్తింపవలయును. ఇంతయేల? రాత్రి పరుండినపుడును దనమగఁడుకూడ నుండినట్లే యెంచవలయును. స్త్రీలు సాలగ్రామములఁ దాఁకరాదు. పూజింపరాదు. అభిషేకింపరాదు.

శ్లో ॥ మృతేభర్తర్యపుత్రాచ బాలపుత్రాచ యాంగనా.
బంధూ నాశ్రిత్య తిష్ఠే త్సంయతాజనకాదికాన్.

పతి మరణించిన సతి బిడ్డలు లేనిదైనను, బిడ్డలు చిన్నవాండ్రైనను తండ్రి మొదలైన బంధువుల నాశ్రయిం చి వారి ప్రాపున నుండవలయును.

శ్లో ॥ తాంబూలో ఒ భర్తృక స్త్రీణాం
యతీనాం బ్రహ్మచారిణామ్,
ఏకైకంమాంస తుల్యం స్యా,
న్మిళితంతు సురాసనమ్.

విధవలు, సన్యాసులు, బ్రహ్మచారులు వక్కగాని,తములపాకుగాని సున్నముగాని నోర వేసికొనరాదు. ఒ క్కొక్కటి మాంసముతో సమానము. మూఁడును గలిసెనేని కల్లు సారాయముగూడఁ జేర్చి పుచ్చుకొన్నట్టు లగును.

శ్లో ॥ యావజ్జీవంప్రేతపత్న్యు
దకోపస్పర్శనమేకభక్త మధశ్శయ్యా
బ్రహ్మచర్యం క్షారలవణ
మధుమాంసవర్జనంచ.

పతి మరణించిన స్త్రీ బ్రతికియుండువఱకు స్నానము,ఒంటిపూఁట భోజనము, నేలcబరుండుట,బ్రహ్మ చర్యము సలుపును, కారము,ఉప్పు సారాయము మాంసము మానవలయును. ఉప్పు కారము రాజసాహారమున కుపలక్షణము. మీఁద వివరించినట్టు విధవయు సన్యాసియు సమానులు. సన్యాసికేవి ధర్మములో విధవ కవే ధర్మములయినను నందు స్త్రీల కేవి విహితములో యవి గ్రావ్యాములు. స్త్రీలకు దండకమండులువులు,దేశాటనము, ఏకాంతవాసము,గ్రాహ్యములుకావు.

అమ్మా ! నాకుఁ దోఁచినది చెప్పితిని,పతి మరణించిన స్త్రీ లీ ప్రకారము వర్తించిరేని యుభయలోకముల శ్రేయస్సుయశస్సు గాంతురనుటయందు సందేహములేదు. ఈ మార్గము కామాసక్త చిత్తలగు మత్త కాశినులకు రుచింపదని నే నెఱుఁగుదును. అట్టి కులుకులాఁడులకు బోధింప నేను ప్రయాసపడను. ఏదైనను జెప్పుట సులభ ము. చేయుట కష్టమనియు నేనెఱుఁగుదును. కష్టమని భయపడి యూరకుండిన ఫలములేదనియుఁ గష్టించి సాధించిననే ఫలము గలదనియు నీ బోఁటు లెఱుఁగ వలయును. ప్రారంభమున సుఖముగనుండి పరిణామంబున దుఃఖమిచ్చునేని యట్టికార్యమును బుద్ధిమంతులు సేయరు. ప్రారంభమునఁ గష్టమై పరిణామంబున సుఖకరమగు దానినే బుద్ధిమంతులు చేయుదురు. ప్రారంభమున నంతమునఁ గూడ సుఖమిచ్చు కార్యములు చేయుట పరమ శ్లాఘ్యము. ఇట్టివారేసాధువులు. వీరి కిందును నందును సుఖమే. రోగికిఁ బ్రియమైన వైద్యుఁడుకాఁడు. రోగలక్షణము దెలిసి దానికిఁదగిన పథ్యము పెట్టువాఁడే రోగిమేలుకోరు వైద్యుఁడు. శాస్త్రము ప్రమాణముగాఁ గొని నీకుఁ దథ్యము పథ్యమునైన దానిఁజెప్పితిని. నడచుటయందు విడుచుటయందు నీవు స్వతంత్రవు. నీ కర్మము కొలఁది

నీకు బుద్ధిపుట్టును.

తల్లీ ! చెప్పఁదగిన విషయములను జెప్పితిని. వానినే మరల సంగ్రహముగఁ జెప్పెదను. అంతయువిని నీ కర్మబలము కొలఁది నీకే వెట్లు రుచించునో యట్లు వర్తింపుము. నేనెన్ని నీతులు బోధించినను, నెన్ని ధర్మములు పదేశించినను నీప్రకృతి గుణములు నిన్నెట్లీడ్చునో యట్టులేపోవుదువు.

శ్లో. "జన్మాంతర సహస్రేషు,యాబుద్ధిర్భా వితాపురా,
తామేవ భజతే జంతు రుపదేశో నిరర్థకః"

వేలకొలఁది జన్మములందుఁ బూర్వమెట్టి బుద్ధిని వృద్ధిచేసికొంటివో యట్టిబుద్ధియే యిప్పుడు నీకుఁ గలుగును. గత జన్మంబులందుఁ దామసబుద్ధిని వృద్ధిచేసికొని యట్టి కార్యములఁ జేయుచుంటివేని యిప్పుడు నీకుఁ దామసబుద్ధియే విజృంభించి తామస కార్యములే చేయుదువు గాని యెవరెంత చెప్పినను సాత్త్విక కార్యములు చేయవు. కావున నుపదేశము నిరర్థకము. అటైన గురు శిష్య వ్యవహారము శాస్త్రము వ్యర్థములు తమోగుణములో మునిఁగియుండిన దానవైతివేని సత్త్వగుణమును వృద్ధిపఱుచు బోధ యీజన్మమున వ్యర్థమైన నగును గాని యిప్పుడు నాటిన బీజము జన్మాంతరముల ఫలింపకపోదు. అప్పుడప్పుడే సత్త్వమునఁ గన్నులు తెఱచుకొని వారికి నుపదేశములేకున్న నెట్లు కడదేఱుదురు? నీ బుద్ధి సాత్త్వికమైయుండెనేని ధర్మబోధ శాస్త్రజ్ఞానమిప్పుడే దానిని మఱింత ప్రకాశింపఁజేయును. కావున నెట్టి దుష్టవర్తనులును శాస్త్రములఁ జెప్పిన శాస్త్రవాక్యము లాధారము చేసికొని నీకీదశ కలుగుటకుఁ గారణము నీ యట్టివారు వర్తింపవలసిన విధము చెప్పితిని. నేనుదాహరణముగాఁ జెప్పినది కేవల నికృష్టదశయందుండు స్త్రీల వృత్తము. అంతటి దుర్దశయందుండని వారంతకంటె మేలైన విధముననే జీవింపవచ్చును.

తన్ను మగఁడు యనడివీధిలో విడిచెనేని, యాదరించువారెవ్వరులే రేని యప్పుడు తాను బ్రాణాధారముగ జీవికకై విద్య నేర్చికాని,నేర్చిన విద్యచేఁగాని కులస్త్రీ మర్యాద దైవభక్తి దప్పని వృత్తిఁ జరించుట దూష్యముగాదు. అట్టి దశయందును నేను మీఁదజెప్పిన వృత్తమునకు హానిగలిగింపక యా ప్రకారము చరించుచుండవలయును. అట్టి శీలపతి యుభయలోకంబుల వంద్యయగు. వృత్తిహానియైనను సైరింపవలయునుగాని వృత్త హాని సహింపరాదని దృఢముగనమ్ముము. సైరంధ్రీవృత్తిఁ జరించిన ద్రౌపది,దమయంతిలోనగు పతివ్రతల వృత్తము స్మరింపుము. పతివ్రతలు తమ ప్రాణముపోకయైన నోర్వవచ్చునుగాని మానముపోక నోరువరాదు. అట్లు తనకు మానహాని గలిగింప యత్నించు పురుషుని స్త్రీలు దమయంతివలెఁ దామే యచ్చోటనే యా నిమిషమునఁ జంపినను,ద్రౌపదివలె రహస్యముగఁ జంపించినను,సీతవలె వాని వంశమును నిర్మూలింపఁ జేసినను దోషముగాదు. పాపమురాదు. దుష్టస్త్రీలు దుష్టపురుషు లెట్టివారైనది తక్కిన హితచర్యయందు వ్రాసియున్నాను. అట్టివారుండు చోటులకు శీలవతులు పోరాదు. వారితో సంభాషింపనురాదు. అట్టివారిని దాముండుచోటికిఁ దఱచురానీయరాదు. వారితోడి సాంగత్యము చేయనురాదు. ఇటుచేసిననిష్కారణ నిందలుగలుగవు. దుష్టస్త్రీ పురుషులలో శుష్కవేదాంతినులు,శుష్క వేదాంతులు గూడఁ జేరియున్నారు. కావున శుష్కవేదాంతులతోను,మాయా యోగులతోను మచ్చికకలిగి మెదలరాదు. వీరి బోధములు విననురాదు. వీరితోడి సహవాసము చేయనురాదు. పామరబోధ యిహమును జెఱచును. శుష్కవేదాంతులు దొంగయోగు లుభయలోకంబులనుండి చెఱుతురు. కావున జాగ్రత్తవహించి చరింపుము. నీవు నమ్ముదువో నమ్మవోకాని కలువాయినుండి యొక వేదాంతి నేను సోమశిలయందుండునపుడు వచ్చియుండి "పతి హితచర్య లఁట సతీహితచర్య లఁట. పతులెవ్వరు? సతులెవ్వరు? కలియుగములోఁ గలియుగధర్మమున వర్తింపవలయును మునుపటి యుగముల చర్య లీకాలమునకుఁ బనికిరావ" ని యిట్టి యసంగత ప్రలాపము లందందు వదురుచుండెనని వింటిని. వీనితల్లి యట్లే వర్తించి వీనిని గనెనో,లేక వీనిభార్య యట్లే వర్తించుచున్నదో నేను విచారించిన వాఁడనుగాను. వీఁడు తన కలియుగ ధర్మములు పరస్త్రీల కుపదేశించుటకంటెఁ దన యింటఁ దనతల్లికిఁ దోడులకు భార్యకు నుపదేశించుట తగును. ఇంట గెల్చినదా రచ్చగెలువవలయును. తాను బోధించు ధర్మమును దా ననుష్ఠించి కదా యితరుల నట్లు చేయుఁడనవలయును. ఇట్లు బోధించువారు స్త్రీలైనను బురుషు లయినను నుపపతి బీజములకుఁ బుట్టినవారని నమ్ముము.

దేహము ప్రకృతి పరిణామము. తమస్సు. రజస్సు,సత్త్వము ప్రకృతి గుణములు,వీని వికారమే మనస్సు, వీనిని జయించి గుణాతీతుఁడైనఁగాని మోక్షములేదు. వీనినిజయించుటకు భక్తి తప్ప వేఱు సదుపాయము సుల భోపాయము నిరపాయమైనది లేదు. ఈ విషయమై యింతకుముందే విస్తరించి వ్రాసియున్నాఁడను. అన్ని యాశ్రమములు నన్ని పురుషార్థములు భక్తిచేతనే సాధ్యమగును. బ్రహ్మచారికైనను గృహస్థునకైనను,విధురనకైనను వానప్రస్థునకైనను,సన్న్యాసికైనను,బాలురకైనను,వృద్ధునకైనను,దరుణులకైనను భక్తియే ముక్తికి భుక్తికిఁగూడ సాధనము. ధర్మార్థకామములు భక్తిచేతనే సుసాధములు. కావున నీవు నీస్థితికి వగవకధైర్యమవలంబించి ముందుండు కాలసముద్రమును దాటి సుఖముగ నావలి యొడ్డుచేరి శాశ్వత సుఖమందుటకు సద్వృత్తము భక్తి సాధనము

